# ఈనాటకమునందు వచ్చు పాత్రలు

## పురుషులు.

సూత్రధారుడు.

శ్రీకృష్ణుడు—కథానాయకుడు.

నారదుడు.

సునందుడు—శ్రీకృష్ణుని చెలికాడు.

విశారదుడు—పురుషవేషము గైకొన్న శారద.

వృద్ధకంచుకి.

సేవకుడు.

## స్త్రీలు.

నటి.

రాధ—కథానాయకురాలు.

శారద<br>లలిత } రాధ చెలికత్తెలు.

సత్యభామ—శ్రీకృష్ణుని భార్య.

మంజరి—సత్యభామ చెలికత్తె.

# కృతి.

అర్ధాంగీ!

పతిపదాంబుజ సేవయే మోక్షమార్గ మనిభావించి, కష్టసుఖములు నాతో సమముగఁ బంచుకొంటివి. నా దేహంబున కేది కావలయునో యని, నిరంతరము నాచిత్తమున మెలంగుచుఁ, బురాకృతకర్మవశమున రెండుసంవత్సరముల నుండి, నను నశక్తుఁడనుగాక, ఐహికసౌఖ్యభాగ్యభోగంబులకు దూరుఁడనై యున్న నా యవస్థను తెలిసికొని నీదేహపాటవము నాసేవకై ధారవోసితివి. సౌశీల్యాది సుగుణంబులయందుఁ బోలిక భామామణులకు మేలుబంతి యనిపించుకొంటివి. తల్లిదండ్రుల కిట్టిపుత్రిక, సోదర సోదరీమణుల కిట్టిసోదరి, భర్త కిట్టిసతి, బిడ్డల కిట్టితల్లి, సేవకుల కిట్టి సేవ్యురాలు, నేస్తకత్తెల కిట్టి నేస్తకత్తె, లేదని జనవినుతిఁ గాంచితివి. నా శరీర దుర్బలత్వమును, నాకష్టములను, నా దారిద్ర్యమును, మఱపించి నన్ను నిరంతరానంద రసపూరిత మనస్కునిగఁ జేసిన నీ నిర్మల మోహానురాగలతలను త్రెంపివేసి, నిన్ను మఱచిపోయి చి॥ సౌ॥ నరపుత్రిక సీతమ్మను జూచుకొనుచు జీవయాత్ర వెడలదీయుమని తెలిపి, యశాశ్వతములగు నిహలోకసౌఖ్యముల విడిచి, (రక్తాక్షి సం॥ భాద్రపద బ ౩౦, 28 సెప్టెంబరు 1924 ఆదివారము) శ్రీహరి సన్నిధి కేగితివి.

సాధ్వీమణీ! సహస్రజన్మములకైన నీఋణము నేను దీర్పఁ జాలను. భవదీయ విమలనామ మాచంద్రార్కతారావనీశరధిస్థాయిగఁ జేయ నీ "రాధాకృష్ణ" నాటకమును రచించి నీ కంకిత మిచ్చుచున్నాను. గ్రహింపుము.

భూతలంబునఁ గ్రాలిన భవత్కీర్తిలతలు విబుధలోకమునఁ గూడ నల్లుకొని, సప్తర్షిమండలంబును దాటి యావల ధ్రువమండలము వఱకుఁ గూడ నాఁక బ్రాకుఁగాక! శ్రీమన్నారాయణుఁడు నిన్ను మహానందపదమునం దుంచుఁగాక!

ఇట్లు, ద్రోణంరాజు సీతారామారావు.

# భూమిక.

ఇంతకుఁబూర్వమే "రాధాకృష్ణ" యనుపేర నొకనాటకమును సుప్రసిద్ధ కవీశ్వరులును, నాకు బంధుకోటిలోనివారును నగు మహారాజశ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు రచియించి యున్నారు. అయ్యది పెక్కుస్థలములయందు నాటక సమాజముల వారిచేఁ బ్రదర్శింపఁబడి యాంధ్రలోకమున ఖ్యాతివహించి యున్నదని చెప్పుటకు సందియము లేదు. అట్టి నాటకమునే నేను మరల నెందులకు వ్రాసితినని లోకులు సంశయమును బొందవచ్చును. రచనా విశేషమున శ్రీపంతులువారిని మించవలయునని తలంపున నేను వ్రాయ లేదు. ఈనాటకము వ్రాయుటకుఁ గారణము నాందియందు చదువరులు చూడఁగలరు. కవికల్పనలు అపారము. కవిహృదయము దురవగాహము. వారి నాటకరచనకును, ఈనాటక రచనకును మిగుల భేదము కలదు. ఆంధ్రులు నా నాటకమును సాదరమతిని జిత్తగించి సుగుణమున్న గ్రహింపఁగోరెదను. సుగుణమే లేదందురా! నా నాటకరచన శ్రీలక్ష్మీనరసింహారావు పంతులుగారి నాటకమునకు మఱింత వన్నెఁదెచ్చును. ఏమయినను రసగ్రహణపారీణు లగువారు సదయహృదయులై గుణదోషములను దెలిపినచోఁ బునర్ముద్రణమందు సవరించుకొందును. ఈర్ష్యాసూయాగ్రస్తులగు వారినోటనుండి వెలువడు నుడులకు మాత్రము ప్రత్యుత్తర మీయఁజాలను.

బెజవాడ,
16-3-25

ఇట్లు,
గ్రంథకర్త.

# పీఠిక.

సంస్కృతపదభూయిష్ఠంబై గంభీరభావయుతంబై యుండి యితర దుర్గ్రాహ్యంబై యున్న ప్రబంధములకంటె సర్వజనసంవేద్యంబై ముద్దులొలుకు తేటతెలుంగునుడికారములతో శోభిల్లు దృశ్యప్రబంధములు (నాటకములు) బహుజనాదరణీయము లగుట వాని విస్తారవ్యాప్తియే తేటతెల్లఁ జాటుచున్నది. ఈ నాటకరచన మహాకవి కాళిదాసు నాఁటి నుండియుఁ గలదు కాని నేఁడు నవీనముగా వెలువడినది కాదు. ఇట్టి జనోపయుక్తములగు వీని మనపురాణములగు రామాయణ మహాభారతములలోని గాథలు తీసి చక్కని శైలితో నాధునికకవులు రచించుచున్నారు. అంతియేగాక నీతిబోధకములగు కథలను గూడ నాటకములుగ వ్రాసి మన ఆంధ్రభాషావధూటి కమూల్యములగు భూషణములు నర్పించుచున్నారు. అట్టి ఆధునిక కవులలో శతాధిక గ్రంథకర్తలును నాటక సరస్వతి బిరుదాంకితులును సహజ కవితావిలాసులు నగు శ్రీ ద్రోణంరాజు సీతారామకవిగారు చేయు భాషాసేవ నిరుపమానము. వీరు భారతనాటకములకును సంపూర్ణ రామాయణాద్యనేక నాటకములకుఁ గర్తలగుటయేగాక నీతిబోధకములగు పెక్కుగ్రంథముల రచించిరి. అవ్వాని గవర్నమెంటు పాఠశాలలఁ బఠనీయగ్రంథములుగా నుంచఁబడుటచే వాని ప్రాశస్త్యము వేఱుగ వ్రాయఁ బనిలేదని తలఁచెద.

నాకు తాళీయముగ వారి యీ రాధాకృష్ణ నాటకమును వీరు రచించు కాలమున వినెడి భాగ్యము లభించెను. ఇందలి కథావను

త్కృతియు రసపోషణము విస్తరించి చే లిఖించుటకుగాను నాకీ శక్తిని గ్రహించి యానందింతురుగాక! శృంగారభక్తిరసములకుఁ బరస్పర విరోధమను లోకాపవాదమున కిసుమంతయు నెడమీయక వారి. నిరుపమాన ప్రజ్ఞావిశేషమున మిగుల వందముగా జతకూర్చి చదువరుల కత్యానందము గూర్చునట్లు లిఖించిరి. ఇందలి రాధాకృష్ణుల సంభాషణ చదివినచో తీరవలెను. ఇంతకుమున్నీ మహాకవి వ్రాసిన ప్రభుసన్మానములను బంకిత సన్మానములను లిఖించి మీరు నిసుగు ప్రబంధక మిట్టి రసవత్తరగ్రంథసముదాయము లిఖించి భాషాసేవఁ జేయుటకుఁ బరమేశ్వరుఁడు వారికి నాయురారోగ్యైశ్వర్యముల నిచ్చుగాక యని కోరుచున్నాను.

శ్రీయుతులగు కొంకాల గోవిందము ప్రభృతు లిట్టి యుపయుక్త గ్రంథములను ప్రకటింపఁ బూనుట ప్రశంసనీయము. ఈ నాటకరాజము ప్రదర్శనార్హమై చదువుకొలంది పాఠకులకభిరుచిఁ గల్గించుట వాస్తవము.

బెజవాడ,
16-3-25.

ఇట్లు,
ప్రతాప వెంకటేశ్వరకవి,
శతావధాని.

# నాంది.

తే. గీ. ప్రాణనాథుండ వీవె దై♦వంబ వీవె
యఖిలలోకగురుండ వీవె ♦ యనుచు భక్తిఁ
దను భజించిన జ్ఞాని రా♦ధానభూటి
నేలు గోపాలబాలకుం ♦ డేలు మిమ్ము.

తే. గీ. మునిజనామర ఘనశోక♦భూషణములు
దైత్యసంహారణములు రా♦ధాలలామ
మానసాభరణము లట్టి ♦ మదనజనకు
చరణములు, మిమ్ము సతతంబు ♦ సాకుఁ గాత.

[నాంద్యంతమున]

సూత్ర—(ప్రవేశించి సభ్యులను జూచి తనలో) ఈ సభ్యులు కాలహరణమునకు సైపఁజాలని విధము తోఁచుచున్నది. కావున సత్వరముగ నేను కార్యము దెస వర్తింపవలయును. (తెరవంకఁ జూచి) ప్రేయసీ! నీయలంకార మింకను బూర్తికాలేదా?

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా! ఆలస్యమునకు క్షమింపుఁడు.

సూత్ర—క్షమించవలసినంత దోషము నీయందేమున్నది. సభ్యులు మన నాటకప్రదర్శనమునకై నిరీక్షించుచుండుటం జేసి, నిన్నుఁ దొందర పెట్టితిని.

నటి—ఇప్పు డిచ్చటఁ గూడియున్న సభ్యు లందఱును సకలకలావిశారదులు. వీరి యుల్లములు రంజిల్లఁజేయుట కష్టమే.

సూత్ర—నీవు చెప్పినమాట నిశ్చయమే. అదియుంగాక శృంగార భక్తిరససంయుతమైన నాటకము ప్రదర్శింపుమని వీరి యాజ్ఞ.

నటి—(నవ్వుచు) బాగున్నది. ఒకదాని కొకటి సంబంధము లేదే!

సూత్రి—అట్లంటి వేమి?

నటి—శృంగారభక్తిరససంయుత మన్న నవ్వు వచ్చినది. ఈరెంటికిని మైత్రి యెట్లు కలుగును. శృంగారమునకు భక్తి దూరము-భక్తికి శృంగారము దూరము.

సూత్రి—వెఱ్ఱిదానా! అట్లు దలఁపరాదు. శృంగార మహార్ణవ-ము దకు భక్తిసాగరమున ముంచి వేయును సుమా!

నటి—ఓహో! ఇందలి రహస్యమును నేను గనుఁగొనలేక పోయితిని. అట్లయిన నిప్పుడు మీరు ప్రదర్శింపఁదలఁచిన నాటక మేది?

సూత్రి—నాందియందుఁ గొంచెము సూచించితిని. చదువుకొన్న దానవు గ్రహింపలేక పోయితివా!

నటి—రాధచరిత్రమా• యేమి! మిగుల శ్రీమనంది పేర్కొంటిరే. మంచి కథయే మీకు దొరకినది.

సూత్రి—రాధ విషయ మంత తృణీకరించితి వేమి?

నటి—

మ. అలబృందావనమందు నెచ్చెలులు హాస్యంబాడినన్ వింతగాఁ
దలిదండ్రుల్ వలదంచుఁ బల్కినను జిత్తంబందు సిగ్గిల్లకే
బలుచందంబుల దేవకీసుతునితో వర్తించు రాధామహో
జ్జ్వలపాత్రివ్రత్యచరిత్రికా! యిపుడు సంభావ్యస్త్రీని హర్షించుటల్.

రాధ మహాజారిణి యని కదా జనాభిప్రాయము.

సూత్రి—పాపము శమించుఁగాక! రాధ చిత్తతత్త్వమును సామాన్యు లెఱుంగఁ జాలక యట్లు పలుకుదురు. విద్యావతివి నీవుగూడ మూఢమతి వైనందులకు విచార మగుచున్నది.

మ. అలఘుప్రజ్ఞల యోగమార్గముల సంభావ్యర్థించు యోగీశ్వరా
వలి కైనన్ ఘనదుర్లభం బయిన దేవస్తవ్యచారిత్రి నా

జలజాక్షున్ వరరాధికాసతి మహాజ్ఞానప్రపత్తిక్రియన్
నిలుపన్ జాలెను చిత్తమందున సదా నిర్ణిద్రభక్త్యాత్మయై.

సర్వము శ్రీకృష్ణమయముగ భావించి తన సర్వస్వమును శ్రీకృష్ణభగవానున కర్పించి కృతార్థురాలయిన యీరాధ చరిత్రము నిఖిలలోకపావనమైనదని యెఱుంగుము. ఆ రాధ భువనమోహనుఁడైన గోపాలదేవుని యెడలఁ జూపించిన- మోహము- అనురాగము- శృంగారము- వేయేల? సర్వము భక్తియుతమే భావింపుము. అట్టి పవిత్రచరిత్ర కథనే నేఁడు ప్రదర్శించి సభ్యుల కానందము గలుగఁజేయుదము.

నటి—ఆర్యా! కవుల లేఖిని కడ్డము లేదు. జారిణిం బతివ్రతగను, బతివ్రతను జారిణిగను జేయఁగలరు!

సూత్ర—అది వట్టిమాట.

తే. గీ. సహజముగ భక్తి విజ్ఞాన సన్మతులను
జన్మతో రానివారు గాని చాన! నెమ్మిగ
కూర్చినాఁడని నమ్మవే కుజనులను
మంచిబోధ యొసఁగునె విషంబు! యగునెగాక.

నటి—నాథా! మననాటకమునకుఁ గర్త యెవ్వరో వినవచ్చునా?

సూత్ర—నటీ! గ్రంథకర్త మనకుఁ బరిచితుఁడే. శతాధికగ్రంథకర్తయని మనవారతనికిఁ బేరిడిరి. జ్ఞాపకమునకు వచ్చినదా!

నటి—ఓహో! మధ్వకుల సంజాతుఁడును, ద్రోణమరాజ వంశక్షీరజలధిపూర్ణసుధాకరుం డగు నారాయణరాయపుత్త్రుఁడును, కుమళ్ళ రాఘవరాయతనూజయగు సీతమాంబాగర్భముక్తాఫలంబును, తిరుపతి వేంకటేశ్వర కవీంద్ర ప్రియశిష్యుఁడును నగు సీతారామకవియా!

సూత్ర—అవును.

నటి—మఱచితిని. ఆర్యా! ఈనాటకము నిదివఱకే యొక సుప్రసిద్ధ కవీశ్వరుఁడు రచించి యున్నాఁడే. మరల నీవేఁడు వ్రాయుట కేమి యవసరము వచ్చినది?

సూత్ర—నీ వెఱ్ఱిప్రశ్నమునకు నేను ప్రత్యుత్తర మీయఁజాలను; కాని దీనికిని దానికిని సంబంధ మేమియు లేదు. కవుల కల్పన లపారము; కవిహృదయము దురవగాహము. అయినను నిద్యాది, రచించుటకు నాకుఁ దెలిసిన కారణ మొకటి యున్నది. తనతోఁ బాటు కష్టసుఖములఁ బంచుకొనిన కాంత- అరకాలు తడి గాకుండ యహర్నిశలు తన్ను సేవించిన భర్తృప్రియాచరణ- పరాయణ కేది కావలయునో యని నిరంతరము తన మానసంబున మెలంగిన సుశీల- తన వ్రేళ్ళఁ జూపింపఁబడక యరుంధతి కతి నొప్పిన పరమసాధ్వి- యర్ధాంగి, యైన యనంత లక్ష్మి నరసమాంబా వియోగమునకు వగచుచుఁ, దత్పవిత్ర నామము నాచంద్రార్కతారావనీశరధిస్థాయిగ వెలయఁజేయ, నీగ్రంథకర్త యీ నాటకమును వ్రాసి, యామెకుఁ గృతి నొసంగెను—(ఇంచుక యూరకుండి) ఇఁక కాలహరణము వలదు. నీవు రాధ పాత్రి ధరింపవలయును.

నటి—మీరు కృష్ణుఁడు కారా!

సూత్ర—అది తరువాత—ముందు నీవు సిద్ధము కావలయును. రమ్ము.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

శ్రీరస్తు.

# రాధాకృష్ణ

## ప్రథమాంకము

రంగము:—బృందావనము.

[ఉద్యానవనమున రాధ ప్రవేశము.]

రాధ—(శ్రీకృష్ణుని నుద్దేశించి) హా! గోపాలకృష్ణా! సకలసద్గుణగరిష్ఠా! నీజననంబుచే ధన్యత వహించిన యీ బృందావనము, నీపాదాంకములచే పావనమైన యీ బృందావన ప్రాంత ప్రదేశములు, నీవిహారంబున కామోదమందుచు, నిరంతరము నీరాకకై యెదురుచూచుచు, స్వాగతం బొసంగు యమునానదీతీరస్థసైకతస్థలంబులు నిన్ను [illegible] యున్నవి. నీ వేణుగానము శ్రవణములయం దిప్పటికినిఁ బ్రతిధ్వనించుచునే యున్నది. నీ వెప్పుడు గోకులంబున కరుదెంతువు? ఎప్పు డీ రాధను గృహార్థురాలిగ నొనర్తువు? బాల్యమాదిగ తనచిత్తము నీపైన నిల్పియుంచిన యీరాధను, పరులు శంకించినను జంకుగొంకులు లేక, మనోవాక్కాయ కర్మములయందు నిన్ను నమ్మి యున్న యీరాధను, తోడికాంతలు పరిహాసమాడినను, లక్ష్య

ము సేయక నీ వెంట నంటి తిరుగుచు నీలమేఘశ్యామసుందర దేహుండ వగు భవదీయాలింగనసౌఖ్యమే మోక్షపదమని భావించిన యీ రాధను- నిరంతరము భవదీయదివ్యమూర్తి హృదయరత్నపీఠమున నిలుపుకొని పూజించుచుండు నీ రాధను- శైశవంబునఁగూడ నన్నుఁ జుచు నిన్నుఁడఁ బాయక లీలలై నీవు గోపాలకబాలురం గలిసి బృందారణ్యప్రదేశంబున గోవులఁ గాచుచుండు నప్పుడు, చాటుగనో మాటుగనో నీకడ కరుదెంచి, నీ దివ్యమంగళవిగ్రహమును సందర్శించి మోహమొం దిన యీ రాధను- శరద్రాత్రులయందు నన్నుఁ గూడి విహరిం చుచు, నీ మురళీగానామృతమును గ్రోలి బ్రహ్మానందమును బొందిన యీ రాధను—కృష్ణా! విడువ న్యాయమా? దేవా! నీయొకబాలునకు నే నోర్వఁగలనా? రాధాకృష్ణుఁ డను పేరు సార్థకముఁ జేసికొనవా?

తే. గీ. రాధకును మాధవునిపైన ♦ గాఢ మగుక
ప్రేమ నాకుపై నతనికి ♦ నమ్మి యుండె
ననుచు జగమెల్ల నాడు వాక్యంబు నిలుప
రావ? యేలవా? రాధికాప్రాణనాథ!

వసుదేవదేవకీతనయా! సకల కలుషహరణములు, నిఖిలామరమౌని శిరోభూషణములు, లక్ష్మీలలనాహృదయాభరణములు, ఖలదైత్యసం హరణములు, ఆశ్రితరక్షణములు నగు నీదివ్య చరణముల సేవ నాకుఁ గరుణింపు రమ్ము. శీతాతపంబుల కోర్చి, మహారణ్యప్రదేశములయందుఁ గుటీరంబుల నిర్మించుకొని, యనేకవిధముల పరమ నిష్ఠలఁ బూని తపంబొనర్చు మహానీయు లగుమును లైనను నీమహామహిమ నెఱుంగ శక్తులుగారు. అట్టిచో అబలను- అజ్ఞానచిత్తను- అగు నే నెఱుంగ శక్య మగునా? జననమాదిగ నీవు మహాప్రభావము గలవాఁడవే!

శా. నందుం డాత్మసుతుండవై వనుచు నానందించెఁ దా; నంతకుం
ముందే నావసుదేవుఁ డల్లి పరమామోదంబునుం గాంచె; నీ
చందం బిద్ధర చిత్రలీల లివి నిస్సందేహ మెల్లాను గో
విందా! నీదగు మోహజాలములు కావే బాలగోపాలకా!

సీ. పూతనావిషదుగ్ధములఁ గ్రోలి దానిని
యమునిఁ జేరఁగ బంపి ♦ నందువలనఁ
బదునాల్గు భువనముల్ ♦ ముదమూర నోటిలో
నమ్మకుఁ జూపించి ♦ నందువలన
గాళీయఫణిఫణాగ్రప్రదేశంబున
నాట్యంబు సల్పిన ♦ యందువలన
గోవర్ధనం బెత్తి ♦ గో గోప గోపికా
బృందంబు రక్షించి ♦ నందువలన

తే. గీ. కంసదానవుఁ జంపి లోకములఁ గాచి
యలఘుశౌర్యము జూపించి ♦ నందువలన
నాదినారాయణస్వామి ♦ వగుటఁ దెలిసె
భక్తసంత్రాణశీల! గోపాలబాల!

దేవా! నాకీ ప్రపంచసౌఖ్యములతోఁ బనిలేదు. బంధుజనములతోఁ బనిలేదు. కృష్ణుఁడే ప్రాణనాథుఁడు, కృష్ణుఁడే నాదైవము, అని నమ్మియున్న నన్ను రక్షింపుము. నిరంతరము నాహృదయమున వసింపుము.

మ. కలనైనన్ సులభంబుగాదు భవదాకారంబు వీక్షింప, న
న్నలినప్రోద్భవముఖ్యదేవతలకైనన్ దేవ! మల్లోచనో
త్పలసాఫల్యము గాఁగ సంతతము నీ ♦ భద్రాయితాస్యేందుమం
డలిఁ జూపించుచునుండుమా కరుణ దీనవ్రాతచింతామణీ!

కృష్ణా! "జననీజన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసి" యను వాక్యము నెఱింగిన మహానుభావుఁడవే. రాధయందుఁ బ్రేమ లేక పోయినను నీజన్మ

స్థల మగు గోకులమందైన నభిమానము లేకపోయెనా? జన్మభూమిని జూచుటకైన వచ్చి నాకు నీదర్శన మీయరాదా? సాక్షాద్భగవంతుడ వైన నీవు మధురయం దున్నను, బృందావనమున నున్న నా మొఱ నీకు వినుపించుచునే యుందును.

శా. గంధేభేంద్రుడు నీరు ద్రావగ మహాగ్రాహంబు తత్పాదముల్
బంధింపం ధృతిఁ దూలి ముక్తి కితరోపాయంబు లేక జగ
ద్బంధున్ నిన్నుఁ దలంపఁ జక్రమున నవ్వైరిన్ మహోదగ్ర గ
ర్వాంధుం ద్రుంచి గజంబుఁ గాచితివి దేవా! దీనచింతామణీ!

ఎక్కడ వైకుంఠపురము! ఎక్కడ కరిరాజు మకరిచే బాధింపఁ బడిన ప్రదేశము! కరిరాజు పెట్టిన మొఱ వినినంతనే కదా నీవు రక్షింపవచ్చితివి? అట్లే మోహానురాగభక్తిపూరిత మైన మదీయప్రార్థనము నీకు వినిపించుట లేదా? వినిపించి, నీదర్శనము నాకొసంగఁదలంచ, రుక్మిణి మొదలగు కాంతలు వారించుచుండిరా? తక్కినవారి విషయ మెట్లుండి నను నిన్ను వారింపఁగల సామర్థ్యము సత్యభామయొద్దనే యున్నది నీవు సాత్రాజితీయాజ్ఞాపరిపాలకుఁడవు కదా! దుర్వాసునకుఁ దుల్య యగు సత్యభామ నిన్ను కదలనీయదు కదా!

[శారద ప్రవేశించును.]

శార—(రాధను జూచి) రాధా! ఎంతపని జేసితివి?

రాధ—శారదా! వచ్చితివా! నే నేమి చేసితిని?

శార—చెప్పకుండ నిక్కడకు వచ్చుటయే. ఇంతకంటెఁ గావలసిన దేమున్నది?

రాధ—అది పొరబాటు మన్నింపుము. నా మానసచోరుఁడైన నంద నందనునిపై మోహ మిచ్చటకు నాబుద్ధి నీడ్చినది.

శార—బాగున్నది. గోపాలుఁడు వచ్చినాఁడా యేమి? అట్లయిన నేడి?

రాధ—నా హృదయపీఠమున నున్నాఁడు.

శార—ఇది నీ వెప్పుడును జెప్పుచుండుమాటయేగా? శ్రీకృష్ణుఁ డిచ్చటకు వచ్చి యొకమాసమైనఁ గాలేదు. ఇంతలోన మఱల వచ్చునా?

రాధ—నిశ్చయమే! అక్కడ అభినవదుర్వాసముని యగు సత్యభామ యనుజ్ఞ నీయవలయును కదా. (సత్యభామ నుద్దేశించి) సాత్రాజితీ! ఈ రాధయందు నీవయినఁ గరుణవహించి, ప్రాణేశ్వరుని నాకడ కొకసారి పంప రాదా? సపత్నీవిరోధముఁ బూని యుంటివా? అమ్మహాత్మునియందుఁ జిత్తముఁ జేర్చినది నేనొక్కతనే కాదు కదా? చెంచుకాంతను వరించెనని యెఱింగి నీవు సహించుకొనలేదా? సాగరకన్యామనోహరుండని యెఱింగి యూరకొనలేదా? వల్లవీజీవనవల్లభుండని గ్రహించి కోప మడఁచుకొనలేదా?

తే. గీ. బాల్యమాదిగ నేపల్లె ♦ వాడయందు
వర్తిలినవాఁడు నాదుభావము హరించి
నాఁడు నందుని పసివాఁడు ♦ నల్లవాఁడు
రాకయుండునె కృపఁ బూని ♦ రాధ నేల?

కృష్ణా!

తే. గీ. చిరతరాబాల్యవర్ధిత ♦ స్నేహ మైన
దలఁప వేల? ఈ రాధను ♦ దలఁప వేల?
చరణసేవకురాలిగ ♦ నరగ నన్నుఁ
బాలనము సేయ రావేల ♦ భవ్యశీల?

(చెలికత్తెను జూచి) శారదా! కృష్ణసంజ్ఞ లేని రాధతనువు కైరవాప్తుఁడులేని రాత్రియే సుమా! నే నెంతయుఁ బొరపాటుఁ జేసితిని. మున్ను నామహనీయుఁ డిక్కడకు వచ్చి తన దివ్యమంగళవిగ్రహసందర్శనము నాకొసఁగి, మోము మోమునఁ జేర్చినప్పుడతని మొగంబెక్కడ

గంధునో యని గట్టిగ ముద్దాడనైతిని. మృణాలపల్లవ విలాసము నుమించు బాహువు లెక్కడ నలుగునో యని గాఢాలింగన మొనర్పనైతిని. భువనమోహనమూర్తి కెక్కడ దృష్టిదోషము తగులునోయని కన్నుల కఱవు దీరఁ దిలకింపనైతిని. చెలీ! నే నెంత మందభాగ్యురాల నైతిని. ఆ దివ్యకౌస్తుభాలంకృతకంధరుని, నిరంతరరుచిమాళమిళితవనమాలికా విరాజితుని, హార-కేయూర కటక కంకట మేఖలాంగుళీయకసముంచిత రమణీయ విభూషణవ్రాతభాసితుని, విమలస్నిగ్ధనీలకుంచిత కుంతలుని, తరుణచంద్ర చంద్రికాకవళి మందహాసుని, సంతతపరిపూర్ణ కరుణావిలాసుని, సకల దిక్పాలభాస్వత్కిరీటన్యస్యూతపద్మరాగారుణ పాద పీఠుని, నే నెప్పుడు చూడఁ గలను? నిరంతర మమ్మహాత్ముని దివ్యచరణారవింద సన్నిధి నివసించు భాగ్యము నాకుఁ గలుగునా?

లలిత—(ప్రవేశించి) కలుగ కేమి! తప్పక కలుగును.

రాధ—లలితా! నేను నీజాడ యిప్పటివఱకును గానిపింపలే దేమి?

లలి—మధురనుండి యేమయిన వార్తలు వచ్చిన వేమో యని యడుగుటకు నందుని గృహంబున కరిగితిని.

రాధ—(ఆతురతతో) వచ్చినవా? మధురయందు నాప్రాణప్రియుఁడు, నాదైవము అగు శ్రీకృష్ణుఁడు కుశలియే కదా? అమ్మహాత్ముఁ డిక్కడకు వచ్చునా? రాధ ననుగ్రహించునా? నాదు దేవుని వార్తలు చెప్పుమా?

లలి—నేఁటివఱకును నేమియు వార్త రాలేదు. కాని, భగవానుఁ డిక్కడకు వచ్చునని చెప్పుకొనుచు నందయశోదలు సంతోష మందుచుండిరి.

రాధ—ఎప్పుడు వచ్చునో!

లలి—నేను జ్యోతిష్యమున నేర్పరిని గాను. కొంతకాలమునకు వచ్చును.

రాధ—అబ్బా! ఆలస్యమున కీరాధ సైఁపఁగలదా!

లలి—నైపుణ్య చేయఁగలిగిన దేమున్నది? అతని కేపోకలు తెలియవా!
ఎప్పుడును వాని రాకనే కోరుచుందువు.

రాధ—లలితా! శ్రీకృష్ణునకన్న నాకుఁ బ్రియమైన వస్తువు ప్రపంచమున మఱియొండు లేదు.

తే. గీ. ఘనునిఁ జూడఁ గోరును చాతకంబు; ద్యుమణిఁ
గాంచ నెంచును చక్రంబు; కమలవైరి
రాకకై వేచును చకోరి; రమణి! నాదు
దేవుఁ దిలకింపఁ గోరు నా భావ మెపుడు.

లలి—సాక్షాత్ శ్రీమన్నారాయణుండగు వసుదేవసూనుని మనోవాక్కాయకర్మములచే నమ్మియున్న నీ వెంతయు ధన్యురాలవు. నీకు నెచ్చెలులమై యున్న మేము కూడ ధన్యులమే.

శార—(రాధను జూచి) చెలీ! రాధా! నందనవనసన్నిభమగు నీయుద్యానవనమునఁ గొంతకాలము విహరింతము రమ్ము.

రాధ—వనవిహారమన్న జ్ఞాపకమునకు వచ్చినది. బాల్యమున,

మ. తలిదండ్రుల్ నలిగించుఁ బల్కినను జిత్తంబునం గంటకై
జలజాతాక్షుని పాదచింతనము మోదంబుం బెంచు సద్భక్తితో
నలుల, గోపాలకబాలురం గలిసి పాటల్ గ్రీడలన్ దేలుచున్
లలితా! నే విహరించినా దినముల నాహ్లాదంబు సంధిల్లఁగన్.

లలి—రాధా! వివిధఫలంబులను మెక్కి శుకములును, లేమావిచివుళ్లను మేసి పికములును, పుష్పములయందు మకరందము ద్రావి మత్తిల్లి భృంగములును శ్రావ్యముగ మంగళగీతనాదములు సేయఁ దొడఁగినవి.

శార—అదిగో! చంచరీకమిథునము. రాత్రియంతయు సరసిజాగారంబులయందు నిద్రించి, మేల్కాంచి నర్మగర్భసంభాషణము సలుపుచున్నది.

లలి—ఆసంభాషణ మేమో నీకుఁ దెలిసినదా ?

రాధ—వానిసంభాషణ మన కెట్లు దెలియును ?

లలి—నాకుఁ బక్షిభాష వచ్చుటచేత గ్రహించితిని.

రాధ—ఏమని ?

లలి—ఏమనియా ! అవి యిప్పుడు నిన్నుగూర్చియే మాటలాడుకొనుచున్నవి. రాధకు శ్రీకృష్ణునియం దమితమైనభక్తి యని చెప్పుకొనుచున్నవి.

రాధ—లలితా ! నీ చతురోక్తులు మానవు కదా ?

శార—చతురోక్తులతోడనే లలిత జన్మించినది. రాధా ! వసంతసమయమగుటచేత నీవనము మిగుల శోభ వహించి యున్నది సుమా !

లలి—అవును. కాని, రాధయో మాధవుఁడు కూడ నుండునేని యీవనము మఱింత శోభ వహించును.

రాధ—లలితా ! నీహాస్యసంభాషణ నాపి, నేఁ జెప్పిన చిత్రపటములు వ్రాసి తెచ్చితివా లేదా ?

లలి—నీవు చెప్పినపని నే మఱచియున్నఁ గార్యములు తీరునా ?

రాధ—అట్లయినఁ దెచ్చితివనియే తలంపనా ?

లలి—సంశయ మేమి యున్నది. ఇవిగో! (కొన్ని చిత్రపటములు ఇచ్చును).

రాధ—(చిత్రపటములను బుచ్చుకొని) నీ చిత్రపటరచనాకౌసల్యమెంతయు శ్లాఘ్యము కదా! (శారదను జూచి) శారదా ! ఈ యుషఃకాలమున భగవానుండగు శ్రీకృష్ణునిఁ బూజించుటకుఁ బుష్పములను గోసికొనిరమ్ము. లలితా ! కృష్ణసంబంధమైన యీచిత్రపటముల నలంకరించుటకు గొన్ని పుష్పహారములను నీవు కట్టెదవా? (ఇంచుక యూరకుండి) వలదు వలదు. వాసు

దేవుని హారములను నేనే కట్టెదను. పుష్పముల మాత్రము నీవు గూడఁ దెమ్ము. నే నీ సహకారభూజము క్రింద వాసినవనై యుందును. (ఇంచుక నడచి) సఖులారా! చూచితిరా? చిగురు జొంపములఁ దిని వలవసి కోకిలలు పైనుండి కూయుచున్నవి. గమగమ వలచు పూవుగుత్తులఁ గాంచి తుమ్మెదలు రొదసేయుచున్నవి. పలకఁ బారిన పండ్లను రుచిఁజూచి చిలుకలు ముద్దుగఁ బలుకుచున్నవి. నీడములను బసినిసువులను మేపుచు గువ్వలు ముద్దులాడుచున్నవి. కోటరంబుల ఘూకములు గుఱ్ఱువెట్టుచున్నవి. ఈకారణమున నీసహకారభూజము తన నామమును సార్థకము జేసికొనుచున్నది.

లలి—అవునవును. మాధవాగమనముఁ గోరునీకుఁగూడ నీసహకారము సహకారియగుటకుఁ గోరుచున్నది.

రాధ—ఈసహకారము క్రిందఁ జంద్రకాంతశిలావేదికపై నీచిత్రపటములఁ బెట్టెదను. మీరు సత్వరముగఁ బుష్పములఁ గోసికొని రండు.

(శారదా లలితలు నిష్క్రమింతురు.)

రాధ—(చిత్రపటములను నొక్కొక్కటి చంద్రకాంతశిలపైఁ బెట్టి) లలిత హస్తమునఁ జిత్రపటరచన కావిధాత వర్ణనాతీతమయిన లాఘవ ముంచినాఁడు. తక్కిన వాని మాటకేమి గాని, నామనో వల్లభుని శైశవక్రీడల పటములఁ జూడ, నిజముగా నిప్పుడు కన్నులయెదుట సకలము జరుగుచున్నట్లే చిత్రించినది.

[మునివేషమున నున్న శ్రీకృష్ణుఁడు ప్రవేశించును]

శ్రీకృ—(తనలో) ఆహా! ఈరాధ తనకంటికిఁ గనఁబడు సర్వవస్తు సముదాయమున నన్నే చూచుచు, నిరంతరము భక్తితో నన్నే సేవించుచున్నది. మేలు రాధా! మేలు. నీవు ధన్యురాలవు.

తే. గీ. మాధవా! యను దివ్యనామములు జెవిని
బడినయంతనే సర్వంబు ♦ విడిచి తన్ను
యత్నము బెంది ననుఁ జూచు ♦ నాత్మయందు
బ్రహ్మమును జూడఁ గోరు తాపసునిభంగి.

తే. గీ. తనదు నిర్మలమైన సద్భక్తిలతల
నన్నుఁ గట్టివైచెను మానసమున రాధ
భవ్యతప మాచరించి యా ♦ శాంభుఁ డెంచు
శివునిఁ బురరక్షకుని గాఁ గఁ ♦ జేర్చినట్లు.

(రాధను బరికించి)

తే. గీ. కాంత రాధిక దేహసౌందర్యము లరసె
వనిఁ బ్రకాశింపఁ జేయుచుఁ ♦ బరగుచుండె
నట్టు పొడచూపి నింగికి ♦ యమితకాంతి
నిచ్చు, నూతన విద్యుల్ల ♦ తికవితాన.

[శారదా లలితలు పుష్పములతోఁ బ్రవేశింతురు]

శార—అమ్మా! రాధా! ఇవిగో పుష్పములు.

రాధ—ఇటు నిమ్ము. (పుచ్చుకొనును.)

లలిత—నీవు స్వయముగా దండ గుచ్చెదవాటవే. అట్లు గుచ్చిన
దండ నేవితప్రియపటమున కలంకరించెదవు ?

రాధ—అన్నియును నాకుఁ గావలసినవే.

లలి—తోనియమ్మా ఈపటమున కలంకరించెదవా ? (నాదియాచిన పట
మిచ్చును.)

రాధ—(ఇందుక కోపముతో) ఇది యేమి సాహసమే !

లలి—ఇంక నేఁ జేసిన సాహస మేమి యున్నది ?

తే. గీ. రాధ యను పేరు విన్నచో ♦ మాధవునకుఁ
బ్రీతి, యమ్మాధవునిపేరు ♦ ప్రీతి రాధ;

కట్టుతాటచే నిర్భర ♦ నిట్టు లొక్క-
చోటఁ జేర్పరాదే నాకుఁ ♦ జోద్య మేమి?

రాధ—(సిగ్గు నభినయించును.)

శ్రీకృ—(తనలో) ఓహో! ఈలలిత మమ్ముల నిరువురను నొక్క పట్టమునఁ జిత్రించినది కాఁబోలు! అందుకని రాధ లజ్జఁబొందుచున్నది.

తే. గీ. బాల్యమందు బృందావనిన్ ♦ బరమమునను
మీఱ నీమహాస్తంబు నా ♦ మెడను వైచి
నాథుఁడవు నీవె యంచును ♦ నన్నుఁ గూడి
సంచరించిన నీకు లజ్జ యిపు డేమి?

ఈ నారీమణికి నాయందు బాల్యమునుండియు భక్తి కలదు. హృదయపీఠమున నిరంతరము నామూర్తిని భావకొలిపి యుంచును. రాధా! పరమయోగీంద్రుల కయినను దుర్లభుండ నైన నన్ను- నీజగన్మోహన రూపలావణ్యాతిశయములచేత, మోహానురాగముచేత, నద్వితీయమైన భక్తిచేతఁ గట్టివేసితివి. నిరంతరము నాసాన్నిధ్యమున నుండఁగోరు నీరాధ- జగమెల్ల నన్నుగా భావించు నీరాధ- అలివేణీజనచూళికాభరణయగు నీరాధ- నిలచినను, గూరుచున్నను, శయనించుచున్నను, మేల్కొనియున్నను, నెవ్వరితోనైనఁ గలిసియుండినను, నొక్కర్తుక యుండినను నన్నే స్మరించుచుండు నీరాధ- నాయెడబాటును సహింపలేక నన్ను ధ్యానించుచుండఁగా, నెదుటనుండియుఁ బ్రియాంగన యభీష్టము దీర్పక పోవుట ధర్మమా!

తే. గీ. ఏను కృష్ణుఁడ వచ్చినా ♦ నిదిగో రాధ!
యనుచు నెదుటఁ బడినయంత ♦ నశివ హర్ష
జలధి మున్గదే? పరమనిష్ఠను దపంబు
సేయువాఁడు దైవమును వీక్షించినట్లు.

నే నీమెకు సాక్షాత్కరించెదఁ గాక. (ఇంచుక యూరకుండి) తొందర పడఁగూడదు. నాపైన నిక్కాంత తన చిత్తమును నేవిధమున నిలిపి యున్నదో, యట్లే నాప్రేమ కతరుణిగూడ పాత్రమైనది. కాని నే నీ వేషమున నీతలోదరిం జేరి, యాచిత్రపటములఁ దిలకించి, చిత్తము నొక విధముగఁ బరీక్షించెదఁగాక! (రాధ యెదుటకుఁ బోవును.)

రాధ—(శ్రీకృష్ణునిఁ జూచి) మహాత్మా! తమ రెవ్వరో మునీంద్రులవలె నున్నారు. ఈసేవకురాలి వందనముల స్వీకరింపుఁడు. (నమస్కరించును.)

శ్రీకృ—అభీష్టావాప్తిరస్తు.

రాధ—మహాత్మా! తమవంటి మహనీయులను గౌరవించుట కియ్యది తగిన ప్రదేశము కాదు. దాసురాలియందుఁ గరుణించి యీచంద్రకాంతశిలపై నాసీనులు గాఁ గోరెదను.

శ్రీకృ—యోషామణీ! నెచ్చెలులతో నీవు వనంబునకు వచ్చితివి మార్గవశమున నిన్నిచ్చటఁ జూచితిని. నీ వినయ సౌశీల్యాది గుణములే నాకుఁ బరమానందము ఘటించినవి. (ఆసీనుఁడై) నీవు వృషభానుని తనూజ వగు రాధవు కావా!

రాధ—మునీంద్రులు నన్నెఱుంగుదురే!

శ్రీకృ—(చిత్రపటములఁ జూచి) అవియన్నియు నేవో చిత్రపటముల వలె నున్నవే. వనంబునకు వానిం గొని వచ్చితి వేల?

రాధ—మునివర్యా! ఇవి యన్నియు భగవల్లీలాసంబంధ ములైనవి. పూజార్థమై తెచ్చితిని.

శ్రీకృ—భగవల్లీలాసంబంధ చిత్రపటములా! ఏవీ! ఒక్కసారి శ్రమయనక నాకును జూపింపఁ గలవా?

రాధ—(చిత్రపట మొకటి చూపుచు)

శా. గారాబం బలరార నెత్తుకొని చక్కం నిక్కం గూర్చుండి పా
ల్గారం స్తన్యమునిచ్చి మే నివురుచున్ గాంచెం మహాచిత్రి మీ
నోర న్నాకముఖాదిలోకములం దన్నుం గృష్ణునిం దల్లి క
న్నారం విస్మయమందె శ్రీధవునిచర్యల్ చిత్రమౌ చూడఁగా.

శ్రీకృ—ఓహోహో! ఇయ్యది మృద్భక్షణవిశ్వరూప ప్రదర్శనము కాఁబోలు! బాగున్నది. అజ్ఞాను లిట్లే తలంతురు. కాకున్న కృష్ణుఁడు నోరు తెఱచు టేమి? అందులోఁ బదునాల్గు భువనములను దల్లి చూచు టేమి?

రాధ—మునీంద్రా! మీవాక్యములు వింతగ నున్నవే. సాగరాచలవన భూగోళశిఖి దివాకర సుధాకర దిక్పాలాదికరంబై యైన బ్రహ్మాండ మంతయుఁ దనముఖంబునఁ జూపిన భగవంతుఁ డగు కృష్ణునిఁగూర్చి యిట్లు పలికితి రేమి?

శ్రీకృ—అదిగో అజ్ఞాన మంతయు నందులోనే యున్నది, కృష్ణుని భగవంతుఁ డనుటలోనే. ఆ రెండవపట మేమి?

రాధ—సర్వము తెలిసిన మహనీయులగు మీరే యిట్లు చెప్పిన నేమనఁ గలను? నందనందనుని భగవంతుఁడు కాఁడని పలికిన మీ కా మహనీయుని తక్కిన పటములతోలి యేల? క్షమింపుఁడు.

శ్రీకృ—చూచిన దోష మేమున్నది?

రాధ—(మఱియొక చిత్రపటమును జూపి) మహాత్మా! ఇది గోపికావస్త్రాపహరణము.

శ్రీ—ఛీ! ఇట్టి చిత్రమును రచించినవారు పాపమునకుఁగూడ పాలు పడిరే! ఇది చూడఁ గూడదు. వినఁ గూడదు. అనఁగూడదు. (పటమును జూచి) గోపికలు జలక్రీడా నిమగ్నలై యుండఁ, దద్వస్త్రముల హరించి కృష్ణుఁడు వృక్షాగ్రము నారోహించి మురళి వాయించుచున్నాఁడా! అహా! ఏమిభగవల్లీల! దిగంబరులై యున్న

కాంతలను జూచుట కాఁ జారుఁ డౌనట్టి యాకృత్యమును భగవ న్మహితముగా భావించి నీవు భగవంతునిగాఁ బూజించుచున్నావా?

రాధ—మహాత్మా! భగవంతుఁ డగు వాసుదేవుని నీవిధముగాఁ బలికిన వానిని కొంచెమును నేను జూడలేదు. అందులో నీవు మునీంద్రుఁడవు. ఇట్లు పలుకుటకు నీ చిత్త మెట్లు సమ్మతించినదో తెలియఁజాలక యున్నాను. సకలమునీంద్రహృదయకర్ణికా మధ్యసంస్థాపితచరణకిసలయుఁ డగుశ్రీకృష్ణుఁడు- నిరంతరభక్త రక్షణదీక్షా బద్ధకంకణుఁ డైనశ్రీకృష్ణుఁడు-సకలదేవతాప్రసన్నుతుం డైనశ్రీకృష్ణుఁడు-నందగోకులవిహారి యైనశ్రీకృష్ణుఁడు-లీలా మానవదేహుఁ డైనశ్రీకృష్ణుఁడు- గోపాంగనామానసచోరుఁ డైనశ్రీకృష్ణుఁడు-దరహాసామృతపూరితవదనుం డైనశ్రీకృష్ణుఁడు- కరుణాంభోరుహపత్రలోచనుం డైనశ్రీకృష్ణుఁడు- పీతాంబర ధరుఁ డైనశ్రీకృష్ణుఁడు-భువనమోహనశ్యామసుందరవిగ్రహుం డైనశ్రీకృష్ణుఁడు- భగవంతుఁడు గాక జారుఁడనియు, గొల్లఁ డనియుఁ బల్కు నీవు మునీంద్రుఁడవు గాక కేవలము నాస్తిక వాదములోఁ జేరిన కుహనాయోగి వని తోఁచుచున్నది.

తే. గీ. నందగోకులమందు నానంద మూని
చిత్రలీలలఁ జూపించి ♦ వెలుఁగెఁ గాని
మహితసద్గుణమూర్తి యౌ ♦ మాధవుండు
పసులఁ గాచెడి కాఁపరి ♦ పాటివాఁడె!

అహా! దిగంబరశరీరములఁ జూచు కోర్కెతో గోపాలదేవుఁడు గోపికల వసనంబుల హరించి వృక్ష మారోహించె ననియా నీవు పలికితివి? ఎంతయజ్ఞానము! ఇందలి తత్త్వము నీవు గ్రహింపఁజాలక పోవుటం దుకు మిక్కిలి విచారించుచున్నాను. ఆ శరీరములు మాయాహృన్మయంబు లగు గోపికల ఫలకు వస్త్రంబులఁ హరించి దానికి చెట్టు కొమ్మకుఁ దగిలించి,

ఇదిగో చూడుము! భగవంతు డైన శ్రీకృష్ణుఁడు!- నిరంతరము బ్రాహ్మ దయులదృష్టమున వసించు భృంగ మైన కృష్ణుఁడు!- ఏమిచేయుచున్నాఁడో చూడుము! వేణువునందు బ్రహ్మగాంధర్వగీతంబుఁ బలుకఁ జేయుచున్నాఁడు-ఇట్టి జగన్మోహనకృష్ణుఁడు జారుఁడా? చోరుఁడా? భగవంతుఁడు కాఁడా? మహాత్మా! తదీయమహాప్రభావ మింతింతనుటకు బ్రహ్మమున కయినను శక్యము కాదు.

శ్రీకృ—అవు నవును-నీవంటి యజ్ఞానమాత్రు లందఱును నట్లే తలఁతురు.

రాధ—మునీంద్రా! శ్రీకృష్ణుని సాక్షాద్భగవంతునిగాఁ దలఁచి తదీయ దివ్యనామస్మరణమే మోక్షసాధకోపాయంబునకు సోపాన మని నిరంతరము నతని సేవించి కృతార్థు లగుచుండు మును లెల్లరును నజ్ఞానచిత్తులేనా! నీ వామునిబృందములోనివాఁడవు కావా? నీవాక్యములతీరు జూడఁగ నొక కపటయోగివని తోఁచు చున్నది. కాకున్న విశ్వగర్భుం డగు దేవకీతనయునిఁ గూర్చి నను

శ్రీకృ—రాధా!

సీ. నందగోకులమునఁ • నాఁటిబాలుఁ గూడి
యలరుట విష్ణులీ • లాత్మకంబు
వల్లవీగృహములఁ • బాలుఁ బెరుఁగుఁ గొంట
భక్తాదిభాజన • ప్రాభవంబు
మనిమిగ్గుచారుని • మలచింది మించెను
ఆమెనివత్సాంతి • శ్యామలంబు
అజ్ఞానచిత్తుల • నలరించు వారిల
లనము భాగవతకా • ర్యాన్వితములు
తే. గీ. గాఁగఁ దలఁచుచుందురు గాని • కలిమి గొల్ల
కులమునందు జన్మమునందె • కొంచెపరుల

జేసి; యెల్లర వంచన • జేసినట్టి
యాదవుం డగుట యెట్లు • మాధవుండు

నిరంతరకాంతాజనసంగతుండు- దధి ఘృత నవనీత చోరుండు- ఆకృష్ణుండు భగవంతుండా! అతనిచర్యలు భగవల్లీలలా! ఆ రాసక్రీడలు- ఆజలక్రీడలు- ఆయమునాతీరమున గోపాంగనలఁగూడి విహరించుటలు- దిగంబరులగు గోపీజనంబులఁ జూచి యానందించుటలు- అర్ధరాత్రికుక్కుటరవముఁ జేసి గోపాలురను మేల్కొలిపి వారుగోవులను దోలుకొని పోయినపిదప గృహంబులు ప్రవేశించి తత్కాంతలఁగూడుటలు- అక్కటా! ఇవియన్నియు భగవంతుని కృత్యములా!

రాధ—ఓహో! జపతపవ్రతాదులచేనైనను వశపఱచుకొనఁజాలని శ్రీకృష్ణపరబ్రహ్మమును తమ హృదయపీఠములఁ బాదుకొలిపి తమసర్వస్వము నమ్మహాత్మునికర్పించి సేవించుచుం గృతార్థులగుచుండిరి. శరణాగతత్రాణపరాయణుండగు వాసుదేవుండును వారిచిత్తములయందే వసించు; వారి కామ్యములఁ దీర్చుచుండును. మునీంద్రా! కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లనునరిషడ్వర్గములను జయించి సత్కర్మరతుండయి, పుర నగర గ్రామంబులు బరిత్యజించి, పర్వతారణ్యముల సంచరించుచు, శరీర ధారణార్థంబు స్వల్పభోజనుఁడై మోద ఖేదంబులు సమముగ భావించి నిర్జితేంద్రియుఁడై పవిత్రాంతఃకరణుండైన యోగీశ్వరుఁడుగూడ నెక్కాలక సమయమున వాసుదేవుని మహిమ నెఱుంగఁజాలఁడు. శ్రీకృష్ణనామసంకీర్తనము జగన్మంగళము- జగన్మోహనము- జగజ్జేగీయమానము- నిఖిలపాపైకనిష్కృతి- సకలదుఃఖనివారణము- దారిద్ర్యవిచ్ఛేదకము- సమస్తమాయానిర్మూలకము- శ్రీకృష్ణపాదపద్మంబులను నిర్మలభక్తితో, నిష్కళంకహృదయముతో సేవించు

వారు పాపంబులఁ బొందరు. పరిహాసమున కైన వాసుదేవునిఁ బలుకని దుర్భాషితునితోడ, కలనైన మాధవచరణారవింద సందర్శనము చేయని వానితోడ, నవ్వులకైన శ్రీకృష్ణ కథా పరిశంసనకు జెవియొగ్గని దుష్కథాభిరతునితోడ, నందనందనుని దివ్యచరణధూళి శిరమున ధరించుట ముక్తిమార్గ మని తెలియ నేరని మూఢమతులతోడ—మునీంద్రా! నేను భాషింపను. వేషమునకుమాత్రము నీవు మునీశ్వరుని వలెనే యున్నావు కాని, భగవంతుఁడగు కృష్ణుని నిందించుచున్నావు. ఇంక నీతోనవసరకాలయాపనము సేయుటకు నాచిత్తము సమ్మతింపదు. నీతో భాషింపఁజాలను. వాసుదేవుని పూజకు నాకుఁ గాలాతీత మగుచున్నది. నాపూజకు విఘ్నము కలిగింపక పొమ్ము. తాపసేంద్రా! పొమ్ము.

శ్రీకృ—(తనలో) నాపై నున్న యీమె యద్వితీయభక్తి యెంతయు శ్లాఘ్యము. రాధా! రాధా! నాపై నింత గాఢానురాగము-మోహము- నిర్మలమైన భక్తియుంచి విలసిల్లు నీవు దివ్యయోగీంద్రుల కైనను సుదుర్లభమైన పదమును బొందఁగలవు. (ఇంచుక యూరకుండి) నే నిప్పు డీమెకు సాక్షాత్కరింపకుండ నిజరూపముఁ జూపి యంతర్ధానుఁడ నయ్యెదను గాక. (ప్రకాశముగా) రాధా! నీ భగవత్పూజకు నే నేల భంగ మొనరింపవలయును. ఇదిగో నే నేగుచున్నాను. (నిజరూపమును జూపి యంతర్ధానుఁ డగును.) (రాధ విస్మయముతోఁ జూచును.)

రాధ—హా! కుహనాయోగీశ్వరా! కృష్ణా! కృష్ణా! న న్నింత మోసపుచ్చితివి? నాయెడల నీ విట్టి మాయను బ్రయోగించుట కేమి కారణము? నా నిర్మలమైన [illegible] హృదయము-నా [illegible] నా [illegible] బరీక్షించుట కిట్లు చేసి

తివా? నాచిత్తవృత్తి నీకు సంపూర్ణముగఁ దెలియునే! రాధా కృష్ణా! బాల్యమునుండిగ ఈ రాధ నీ చరణదాసియని యెఱుంగు దువే! నిర్మలభక్తిజ్ఞానవైరాగ్యచిత్తయని నీవెరవు! విశ్వజన్మ స్థితిలయంబులకు నీవుగారణంబని యెఱింగిన యీ రాధ యొకట- నీ శుభనామచింతనము సంసారబంధమునుండి తొలఁగుటకు మార్గమని కనుఁగొనిన ఈ రాధ యొకట- నీ చరణభక్తి రజ స్తమోగుణపరిభూతము లైన కామక్రోధలోభాదుల నడంచి వేయునని తెలిసికొనిన ఈరాధ యొకట- లోకులవాక్యములు పాటింపక బాల్యమునుండిఁ దన మనఃబుద్ధియు నీ యధీనముఁ జేసి తుదకు రాధ పేరుతో మాధవుని పేరుఁ గూడఁ గలిపి రాధాకృష్ణుఁడని యుచ్చరించునట్లు జేసికొనిన ఈ రాధ యొకట- నింతమాయఁ జూపితివేల? కృష్ణా! రాధాధరపానమోదిత మనోభృంగా! పింఛమాలికాపరిభావిభాసితాంగా! నిజభ క్తసంగా! అనుదినము- ప్రతిగానము- ప్రతిఘడియ- ప్రతి నిమిషము- నీ దర్శనమునే కోరుచుంటినే! అట్లు కూడా నాయుపేక్షఁ జేసితివె నాచిత్తముఁ బరీక్షించుటకు వచ్చి నిజరూపము మాత్రముజూపి భాషింపక- కౌఁగిలింపక- చరణసేవ నొసంగక- పరితాపమును దీర్పక. నందనందనా! ముకుందా! అరుగుచు న్నాఁడవా? నమనీయొనలఁ జేసిన యీ రాధ యేమియున్నది?

శార—అమ్మా! రాధా! చిత్తము చలించినదా యేమి?

రాధ—చిత్తము చలించుటేమి? ఇప్పుడు మనము చూచిన కుహనా యోగీశ్వరుఁడే- నాపాలిటి దేవదేవుఁడు- నామనోనాథుఁడు- నా భాగ్యముల పంట- నా యానందమునకుఁ గారణుఁడు- గోపాలదేవుఁడు- నన్ను వంచించినాడు. అయ్యో! మీరయినను గ్రహింపలేక పోయితిరి కదా! కృష్ణస్వామియని నేను గుర్తించి

యుంటినేని, సనకసనందనాది మునిబృందపూజితుండైన యమ్మహాత్ముని గట్టిగఁ బట్టుకొని, తదీయ దివ్యమంగళవిగ్రహమును గట్టిగఁ బట్టుకొని యాలింగన మొనర్చి కృతార్థురాలను గాక యుందునా? తదీయ చరణాంబుజ నెత్తి మదీయ హస్తములకుఁ బవిత్రతఁ గల్పించుకొనక యుందునా? అమ్మహానీయునితో మంజులసంభాషణ గావించి నోటికి బావనముఁ జేసికొనక యుందునా? పద్మకోశము వాయ నద్దేవాదిదేవునకుఁ బూవులతో సూసకు గట్టి పీవక యుందునా? వాసుదేవా! నాకీ భాగ్యముఁ గూర్పకుండ నంతర్హితుఁడ వైతి వేమి? నీవు రాధ చిత్తము బరీక్షింప నవసరములేదు. ఎప్పుడును రాధ నిన్నే నమ్మియున్నది. బాల్యమున బృందావనమున ఈరాధతోఁ దాగుడుమూత లాడితివి. ఇప్పు డిట్లు సేయుచుంటివా? ఎప్పుడును నీవు నాపాలిటికి బాలగోపాలుఁడవే. (చెలికత్తెలను జూచి) సఖులారా! చూచెదరేమి? నాకాంతుఁడగు కృష్ణుఁ డెట్లుపోయెనో చూడుడు?

లలి—రాధా! ఇచ్చట కెవ్వరును రాలేదే. నీవిట్లు బలికెద వేల?

రాధ—రాకపోవుట యేమి! మునీంద్రసి మీరు చూచితిరి కదా!—

అదిగో మాయమగుట చూడలేవా? అతఁడే నాజీవితేశ్వరుఁడు ఇదిగో—ఇదె చూడుఁడు. పద్మాంకుశచాపచక్రమత్స్యరేఖాలంకృతమైన మాధవుని పదములు—సనకాదియోగీంద్రహృదయ సంస్థాపిత మైన పదములు—శ్రుతివధూసీమంతవీధులఁ జెన్నమిగులు పదములు—సమస్తకలుషవిభంగ యగు గంగాభవానికి జన్మస్థలం బైన పదములు ముక్తికాంతామనోమోహనంబులైన పదములు—బ్రహ్మేంద్రాది బృందారక ప్రముఖ కిరీటరత్నరుచిదీపితములగు పదములు—పీసం బట్టరాయైన మాధవుఁడు వచ్చిన జాడ గ్రహింపలేవ? (కృష్ణుని నుద్దేశించి) కృష్ణా!

మ. సరసీజాతభవాదిలేఖవరు లంశాంతంబు సేవింపఁ జె
 ల్లింపై యుండు మహానుభావుఁడవు నీవీ భంగి మాయామలీ
 శ్వరరూపంబున రాఁ బనేమి? నిజరూపస్ఫూర్తితో వచ్చినన్
 బరమశ్రద్ధను దేవదేవ! నిను సంభావించి పూజింపనే?

పరిపంచమున నాకు నీసేవకింటె నన్యమేమియును లేదే? నీచరణంబు లాశ్రయించి- నీదాననైన నన్ను నకరుణావలోకనమునఁ జూడకున్న నేను జీవింతునా? నందనందనా! ఎందుఁ బోయెదవు? గోవిందా! నిలువుము. పద్మమాలికాలంకృతా! నీసేవ సేయుటకు నేనుగూడ వచ్చుచుంటిని. పద్మనంకాశచరణా! దీనురాలిని విడువకుము. నీ వెక్కడ నున్న నేనును నక్కడకు వచ్చెదను. శారదా! లలితా! నాకీప్రపంచముతో బని లేదు. నాకు గోపాలసన్నిధియే కావలయును. నే నిప్పు డాతనినే చూడవలయును. నా కా దేవదేవుని జూపింపుఁడు. అతఁ డే మార్గముననే పోయియుండును భక్తురాలి మొఱ నాలకింపఁడా! నిలువఁడా! ఒకస్త్రీ- అందులో నిర్మలజ్ఞానవైరాగ్యచిత్త- తన సర్వస్వము నతని కర్పించిన భక్త్యాత్మ- బాల్యమాదిగఁ దన్ను వలచి ప్రాణేశ్వరుఁ డనియు, దైవంబనియు, జగద్గురుండనియు, మాటలచేతఁ బనులచేతఁ దన్ను సేవించుచుండిన ప్రియభామ- వెంట వచ్చుచున్నదని తలంపఁడా! ఇదిగో- పోవుచున్నాను. కృష్ణా! నిలువుము. రాధ వచ్చుచున్నది.

(నిష్క్రమించును.)

శార—లలితా! ఇదియేమి! ఈ మాయమునిది యేమి! కృష్ణుఁడేమి!
 రాధ చిత్తము భ్రమించినది. ఈ వెళ్లుట యెక్కడికో! మన
 మరిగి నెమ్మదిగా నామెను గృహమునకుఁ జేర్చుదము రమ్ము.

లలి—నేనును నదియే చూచుచున్నాను రమ్ము.

(ఇరువురును నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రథమాంకము.

శ్రీరస్తు.

# రాధాకృష్ణ

## ద్వితీయాంకము

రంగము:—[మందిరమున రాధ ప్రవేశము.]

రాధ—(కృష్ణుని నుద్దేశించి)

సీ. కోప మేటికిఁ బూనఁ • జూప వేటికి మోము
పాపమా నాయది • గోపబాల?
ధర్మమా యిది నీకు • కర్మమా నాయది
మర్మ మేటికిఁ బూన • నిర్మలాత్మ?
పంతమా నాతోడ • చెంతఁ జేర నదేల
శాంతిమూర్తివి క్షీర•జలధిశయన?
నేరమా నాయందు • భారమా నీ కేను
కరుణఁ బూన వదేమి • కమలనయన?

తే. గీ. నిఖిలలోకైకరక్షుఁడ • నియతి నుందు
వాఁడ నగుటచే నన్నుఁ గా•పాడుము వని
ప్రార్థియించితిఁ గాన దే•వాదిదేవ!
మాధవా! రాధికాధవా! • మహితచరిత!

గోపాలకృష్ణా! నేను నీకై పొందుచున్న సంతాపము నీ వెఱుంగక యుంటివా? నాకు నీ దివ్యసందర్శన మొసంగకయున్నచోఁ దాళఁ గలనా? నిన్నుఁ జూడనిదినము నాకు దుర్దినమే కదా! గోవిందా! నీవు నన్నుఁ జూడ రాకయుంటివేని నాప్రాణములు నిలువవు. నాప్రాణములు పోయినపిమ్మట నీవు వచ్చిన నేమి రాకున్న నేమి? సమస్తప్రాణులకు రక్షకుఁడుగా నుండియు, రాధప్రాణములు పోఁగొట్టె నను నింద నీకు వచ్చుననియైన శంకింపవలదా? నందకిశోరా! బృందావన విహారిశౌరీ! మాధవు కరుణఁ గాంచినరాధ భాగ్యమే భాగ్య మని జనులు చెప్పుకొనుచుందురే! నేనును, నట్లే నీవు నిరంతరము నాయందుందువని సంతసించుచుంటిని. అట్టిలో నా మొఱల నేల కరుణింపవు?

తే. గీ. కపటముని వేషమును బూని ◆ గారవమున
భంగి యట్టె యేతెంచి యౌవ్వనమునను
నాకుఁ బొడసూపి యంతలో ◆ నన్ను మాయ
ముంచి చనుట ధర్మమె నీకు ◆ మురవిదారి?

కృష్ణా! రమ్ము. మధుసూదనా! నిన్ను నమ్మిన మానినీమణిని నిట్లు సంతాపముపాలు సేయుట ధర్మము కాదు. భవదీయ గాఢాలింగన సౌఖ్యాబ్ధిని నన్నోలలాడించి సంతాపమును బాపుము.

మ. సకలప్రాణుల కంతరాత్మ వగుటన్ ◆ సర్వాత్మలం గల్గు కో
ర్కెలెల్లన్ సమకూర్చుచుండెదవు ద ◆ ర్శేయంబె మద్వాంఛితం
బెఱ నే నేమని విన్నవించెదను నీ ◆ వే జూడ నీ కాక నో
యకలంకాత్మ! మునీంద్రకేశవ! తిరావా? కావవా? మాధవా!

శా. నే నే జన్మము నెత్తుచుండినను నిన్నే నమ్మియుండన్ ముకుం
దా! నాచిత్తమునం దుండవే కృపరా ◆ దా! వాడ నాడెడ! రా

ధానారీమణి ప్రార్థనంబు వినఁ జేవా! సత్యయున్ విడవా?
మానారీహృదయాబ్జబంధుర! యిఁకన్ మన్నింపవే మాధవా!

మ. వనజాతేక్షణ సత్యభామ వినుఁ దాఁ బాలించెదుఁగాక; నా
యనుఁగు న్నెచ్చెలి రాధఁ జూడవలదా యంచున్ దగంబల్కి, నా
కనుమోదంబు ఘటింప నిమ్మెడకు రావా? ప్రేయసింగావ; నీ
ఘనపాదాంబుజసేవఁ గోరుచుకదా కల్యాణగోపాలకా!

ఉ. శ్రీయువతీమనోహర! సుశీలగుణాకర! యప్రమేయ! రా
వే! యిఁకనైన బ్రోవ నరవిందదళేక్షణ! భక్తరక్షణా!
నీయెడఁబాయ సైపఁగలనే! లలనల్ పదకోటివాను; కృ
ష్ణా! యనువారి దోషము ద్రితాపనివారణ! వారణావనా!

మ. ఘనమాహాత్మ్యుఁడవు నీ వెఱుఁగనిది లే దావంతయున్ నన్నునున్
ఘనకారుణ్యముతోడఁ జూతువని వేడ్కన్ బాల్యముందే మనం
బున నీయందునఁ జేర్చి సంతతము సంపూర్ణాను రాగంబునన్
దినముల్ బుచ్చుచునుంటిఁ గాదె సకలార్థిప్రార్థిత చింతామణీ!

ఆ గోపాలదేవుఁడు కుహనామూర్తియై నన్ను వంచించి యరిగెనే! నే నెప్పుడా మహాత్ముని సందర్శింతును? ఎప్పుడా సుందరాకారుని చరణసేవ సేయుదును? కర్ణంబులకు భూషణంబులును, పాపపేషణంబులును, హృదయతోషణంబులును, కల్యాణవిశేషణంబులును నగు మాధవుని భాషణంబుల నెప్పుడు విందును? నాచిత్తమునఁ గలిగిన పరితాపము మాధవపదారవిందసందర్శనమునఁ గాని చల్లారదు.

తే. గీ. విరహతాపానలంబున వేఁగు నాదు
హృదయ మామాధవుని కృపావృష్టి చేతఁ
గాని చల్లార దిప్పు డాఖండమైన
యగ్ని యుదకంబుచేఁ గాని యారనట్లు

(ఆకసమువంకఁ జూచి) ఓహో! ప్రాచిదిశాంగనాముఖంబున భాసిల్లు
సింధూరతిలకమువలె, విరహుల ధైర్యలతలను ద్రెంపుటకు మద
నుండెత్తిన చక్రము గతి నలరారుచుఁ, జంద్రుఁ డుదయించినాఁడు.
ఇప్పు డితని రాక నాకెంతయు సమ్మోదము. మధురానగరంబున
నున్న నాదేవదేవుఁడు- ప్రాణనాథుఁడు- అగు గోపాలమూర్తిఁ
గూర్చి యీతని కేమయిన దెలియునేమో యడిగెదఁ గాక! ఓ సుధా
కరా! పొత్తుల శిశువై యున్నప్పుడే పురుటింటియందు గరళస్తని
యగు పూతనను జంపిన మాకృష్ణుఁడు మధురయందు సుఖముగ
నున్నాడా? మూడు నెలల బాలకుఁడై శకటాసురుని నంతకనికటస్థు
నిగాఁ జేసిన గోపాలునకుఁ గుశలమే కదా? వ్రేతలు చెప్పు వాక్యముల
నాలించి ముద్దుల కొమరుని మద్దులకుం గట్ట, నావృక్షంబులఁ గూల్చి
గంధర్వుల శాపము వాపిన శౌరికి క్షేమమే కదా? తన వదనాంభోజము
నందు నానాలోకజాలములను దల్లికిఁ జూపిన విశ్వగర్భునకు భద్రమే
కదా? యమునానదీప్రాంత హ్రదంబున డాగి యా జలపానముచే
జనులను గోవులను మృతినందించుచుండు కాళీయాహిఫణాగ్రంబుల
దాండవం బాడి వాని నటునుండి వెడల నడిపిన యదుసింహునకు
మంగళంబే కదా? అరణ్యమున గోపకు లొక్కరాత్రి నిద్రను మునింగి
యుండ, వారిని దావానలము చుట్టుముట్టికొన, వారు లేచి భయ
భ్రాంతులై "కృష్ణా! మమ్ము రక్షింపు" మని వేఁడ, వారి నందఱను
గన్నులు మూసికొనుఁడని తెల్పి, దావాగ్ని మ్రింగిన పద్మాక్షున
కానందమే కదా? ఇంద్రుని మాయచే గురియుచున్న కఠిన పాషాణ
వర్షమున కాగఁజాలక గోపకు లెల్లరు వేఁడ, గోవర్ధన పర్వతమును
పూగుత్తిచందమున కెంగేల ధరించి గో గోప గోపికాజనమును రక్షిం
చిన భగవంతునకు సౌఖ్యమే కదా? శరదారంభమునఁ బండు
వెన్నెల కన్నులపండువు సేయు నొక్కరాత్రి, బృందావన వీధి యందు

ముఖచంద్రికాతపములు గోపాంగనానయనోత్పలంబుల కానందముం గూర్ప, మురళీగాన మొనర్ప, దద్గానమునకు మోహితాత్మలై, గోపిక లెల్లరు నమ్మహానుభావునిం జేర, వారింగలిసి రాసక్రీడల సలిపిన వేణుగోపాలునకు సంతోషమే కదా ?

ఉ. చాలిన చల్దిమూటను భుజంబున దాల్చి వనాళి కేగి, య
య్యాలల నెల్లఁ బచ్చికబయళ్ళకుఁ దోలి, యనంతరంబు గో
పాలక బాలురం గలిసి ♦ పావనవాహినిఁ దాన మాడు గో
పాలక బాలకాగ్రణికి ♦ భద్రమె? యామధురాపురంబునన్.

శా. బృందారణ్యతరుప్రదేశముల గో♦బృందంబులన్ మేపుచున్
మందంబౌ మురళీరవంబు నచటం ♦ బల్మారు గావించు గో
విందుం జూచితె? సౌఖ్యమే యతనికిన్ ♦ విందున్ గృపన్ బల్కుమా?
యిందూ! యమ్మధురాపురంబుఁ గని నీ ♦ వేతెంచితే యిప్పుడున్.

చ. మనసు హరించె బాల్యమున ♦ మానిని కెవ్వతె కీయనట్టి యా
చనువు నొసంగె నాకుఁ దను ♦ సంతసమేర్పడ; రాధికామనో
వనజహితుం డటంచు జన ♦ వాక్యము గాంచెను; నాకు దైవ మా
యనఘుఁడు నందసూతి సుఖ♦మా? మధురాపురిలో సుధాకరా!

ఓగి కౌఁగిటకుఁ గాని, యోగిజనచిత్తాబ్జములకుఁ గాని, శ్రుతులకుఁగాని చిక్కక, ఈ రాధాకాంత కౌఁగిటకుఁ జిక్కిన మహానుభావుఁడు- సర్వేశుఁడును, సర్వాత్ముఁడును, సర్వగతుండును, సర్వమయుండును నై యుండి, బృందావనమున నీరాధ నెప్పుడును నెడఁబాయక యుండిన దయాసాగరుఁడు- శరద్రాత్రులయందు యమునాతీరమున జగన్మోహనంబగు వేణుగానంబున నాచిత్తమును బారవశ్యముఁ బొందించుచు నన్నుఁగూడి మెలంగిన శ్యామసుందరమూర్తి- ఆ శ్రీకృష్ణుఁడు- నా మనోవల్లభుఁడు- రుక్మిణీమానసాంభోజాత దినాకరుఁడు- సాత్రాజితీ

యాజ్ఞాక్షరపాలకుఁడు- జగన్నాటక సూత్రధారి- గోపాంగనాజారుఁడు- దధిఘృతనవనీతచోరుఁడు- సుధాకరా! క్షేమముగ నున్నాఁడా? ఈ రాధను- దన సేవకురాలిని- బృందావనవీథులయందుఁ దనకు మఱల సంగమమును గూర్చిన ప్రియకాంతను- ఎప్పుడైనఁ దలఁచునా చెప్పుమా? సత్వరముగఁ జెప్పుమా? నన్నుఁ జూచుట కొఱకు నీయొద్దకు వచ్చునా? నాపరితాప మార్పునా? వేగవచింపుమా? చంద్రా! వచింపుమా?

శారద—(ప్రవేశించి) చెలీ! రాధా! ఇఁకను నీవు నిద్రింపలేదా?

రాధ— తే. గీ. చిత్త మంతయు హరిపైనఁ • జేర్చి యతని
దర్శనము గోరు నాకు ని•ద్ర యెట్లు వచ్చు
నిజ విభుని రాకకై వేచు • నీరజాక్షి
యతఁడు రాకుండఁ బానుసే • యతివయున్న !

(ఆకసమునంకఁ జూచుచు) సఖీ! చూచితివా. నా దేవాదిదేవునిఁ గూర్చి చెప్పుమని యెంతయడిగినను నాకుంకజన్మకు మాటలాడక యున్నాఁడు. మాటలాడక పోవుటయేగాక నాకు మఱింత తాపమును గూర్చుచున్నాఁడు. సుధాకరుఁ డనుటకన్న నితనిని దోషాకరుఁ డనుటయే మేలు. గౌరవమునంది దగ్గఱకుఁ బిలిచినందుల కితఁడు శంభుని తలపై నెక్కినాఁడు. తనకు సమస్త విద్యలనేర్పిన గురునికొంపఁ గూల్చినాఁడు. తనను రాజుగాఁ జేసికొనిన చక్రిసంతతికి వెతఁగొలిపినాఁడు. శారదా! ఈచంద్రునకు రాజశబ్దము నేతిబీరకాయవిధము సుమ్మా! (కృష్ణుని నుద్దేశించి) కృష్ణా! ఈలోకమున నాకు నీవు గాక మఱియొకఁడు గనిపించుట లేదు. అహర్నిశలు నీమూర్తినే తలపోయుచుందును. కన్నుల యెదుట నీరూపమునే చిత్రించుకొంటిని. కమలముల నిరసించు నీ నేత్రములతో- నిరంతరము భక్తసంతతిని కృపంజూచు నేత్రములతో- క్షీరసాగరకన్యక కానందమైన నేత్రములతో- నన్ను వీక్షించి, శరత్కాల చంద్రికారుచుల దెగడు నీమందహాసమును నాపయిఁ బఱపి,

నన్నుఁ గౌఁగిలింపుము- కృష్ణా! కౌఁగిలింపుము. వాసుదేవా! ఈ రాధను నీవు మఱచినను- నిన్ను రాధ మఱువదు.

శార—రాధా! ఈ యారాటమేల? కృష్ణుఁడు ఈరాత్రి యిక్కడకు వచ్చునని వార్త తెలియవచ్చెను గదా!

రాధ—ఏమీ! నానాథుఁడు- పరమాత్ముఁ డీరాత్రి వచ్చునా! నిశ్చయముగా వచ్చునా! శారదా! నీకెవ్వరు చెప్పిరే- చెప్పుమా?

శార—అమ్మా! నీకు జగమంతయుఁ గృష్ణమయముగనే కనిపించుటచే నెవ్వరిమాటలును శ్రవణరంధ్రములఁ బ్రవేశింపక యున్నవి. మధ్యాహ్నము వాసుదేవుని చెలికాఁడగు సునందుఁడు చెప్పలేదా?

రాధ—చెలీ! మఱచితినిసుమా! ఆ సునందుఁడిప్పు డెచ్చట నున్నవాఁడు?

శార—నందుని గృహమున ముకుందాగమనంబునకు నిరీక్షించుచున్నాఁడు. కృష్ణుఁడు తప్పక విచ్చేయును. నీ విట్లుండుట పాడి కాదు. సమస్తభూషణాలంకారశోభితవై యాతని రాక కెదురు చూచుచుండుము.

రాధ—ఏమే శారదా! నా నాథుని కృత్రిమాలంకారములచేత వశపఱచుకొనుట! నా నిర్మలమైన భక్తి- యనురాగము- ఆతఁ డెఱుఁగును. అతఁడు నాయందుఁ గృపఁ బూని యుండును.

శార—అదికాదమ్మా! కృష్ణునకు నీయందు మోహానురాగము లున్నవనుటకు సందియము లేదు. అయినను నట్టి యలంకారము లోకసహజము. నామాట వినుము. సమస్తాభరణములను ధరించి యుండుము. భువనమోహనమూర్తి యగు నాతఁడు నిన్నుఁ జూచి- చూచినంతనే- ఆనఁగా నొకనిమేషమైన తెప్పపాటు సేయక- సంతతము భక్తుల కభయప్రదానములైన కరముల చేత, షోడశసహస్రాంగనాగాఢాలింగనమున నలరారు కర

ములచేత, కుబ్జవక్రత బాపి, యామును జగన్మోహన ఘటికగా నొనర్చిన కరములచేత, నిన్నుఁ గౌఁగిలించుకొనును.

రాధ—నీపరిహాస మాపుము.

శార—ఇందుఁ బరిహాస మేమియున్నది. కృష్ణపరిరంభణసౌఖ్యము నీక నొకగడియలోన కాంచఁగలవు కదా!

రాధ—హా కృష్ణా!

శార—ఇంతలోన తొందరయా?

రాధ—(కృష్ణుని నుద్దేశించి)

మ. కడచెన్ పక్షయుగంబుగాఁ గడిపితిన్ • కంజాయతాక్షా! యిఁకన్
గడుపన్ జాలను వేగవచ్చి నను నీ • కారుణ్యవారాశి నోం
పదగన్ ముందు ముదంబుగూర్పుము సముద్యద్భక్తిఁ బ్రార్థింతు నీ
పదసేవకురాల యాదవమణీ! • భక్తాఘచింతామణీ!

శార—(నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) రాధా! ఈభూషణంబుల నలంకరించుకొనుము. పోనిమ్ము. నే నలంకరించెదను. (అట్లు చేసి) ఇప్పుడు దర్పణమునఁ జూచుకొనుము.

రాధ—(అద్దమునఁ జూచుకొని) శారదా! ఈయలంకార మంతయుఁ జూచి నాథుఁ డాగ్రహింపఁడు కదా! గంగిరెద్దుమెడనుండు గంతలవలె నున్నవని పరిహాసించునేమో! పోనిమ్ము. ఇవియన్నియుఁ దీసివేయుదునా?

శార—చాలు. చాలు.

రాధ—(మరల నద్దమునఁ జూచుకొని) శారదా! ఈచీర—

శార—నేనూహ కదియే చెప్పఁ బోవుచున్నాను. ఇది విడిచి మల్లెమొగ్గల చీర ధరింపుము. రమ్ము. (ఇరువురును నిష్క్రమించి వెంటనే ప్రవేశింతురు).

శార—నాటకములోని వేషము పూర్తియైనది. ఇఁకఁ గృష్ణునియొద్ద నెట్లభినయింతువో?

రాధ—ఏమే! నీచమత్కారవాక్యములు! (ఇంచుక యూరకుండి) శారదా! నాయానసరోజుఁ డింకను రాఁడేమే! వచ్చునని నీవు చెప్పుటచే యేనిముషమునం దా మహనీయుని దర్శింతునాయని చిత్తము విప్పారుచున్నదే. చెలీ! ఆగ్రహింపక నందునిగృహమునందున్న సునందుని నొకసారి తోడ్కొని వచ్చెదవా? శ్రమ యిచ్చితినని తలంపవలదు. పొమ్ము. సత్వరమ్ముగ రమ్ము.

శారి—(నిష్క్రమించును).

రాధ—నాథుఁ డింతవఱకును రాకుండుట కేమికారణము? వచ్చెదనని సునందుని ముందు పంపినవాఁడు రాకయుండునా? ఒకవేళ వచ్చినపిదప నందుని గృహమునఁ గుశలప్రశ్నవిచారణంబున నాలస్యమైనదేమో?

[శారదయు సునందుఁడును బ్రవేశింతురు.]

శారి—రాధా! సునందుఁడు వచ్చినాఁడు.

రాధ—అయ్యా! బ్రాహ్మణోత్తమా! సునందా! నా దైవమేడీ? నా గోపాలకృష్ణుఁడేడీ? మధురనుండి వచ్చినాఁడా? ఇప్పుడు నందునిగృహమందున్నాఁడా?

సునం—(కన్నులు నలుపుకొనుచు నూరకుండును).

రాధ—అయ్యో! మాట్లాడవేమి? కృష్ణుఁడు రాలేదా?

సునం—అబ్బా! నిద్రమత్తుమీఁద నాకు మాటలు వినిపించుట లేదు. మార్గాయాసమునఁ జెన్నయున్న నేను చక్కమాలినట్టుండెడి యీ దేవళముగా అనుకొన్నటకే అన్నదే తడవుగా, సుపలు తెలియకుండ నిద్ర వచ్చినది. సుఖముగా నిద్రపోనిచ్చకుండా యమదూతవలె నీశారద సిద్ధమై ఓ సునందా! ఓ సునందా! ఒక

సునందా! అని మేల్కొలిపి యీడ్చుకొనివచ్చినది ఇక్కడకు వచ్చినా ననుమాటయే గాని యెట్లు వచ్చినానో నాకే తెలియదు.

రాధ—సునందా! నే నడిగిన మాటకుఁ బ్రత్యుత్తర మీయ వేమి?

సునం—నీమాట నేను వింటకదా! నా మన స్సంతయు నిద్రమీఁదనే యున్నది.

రాధ—నావల్లభుఁ డైన కృష్ణుఁడు వచ్చినాఁడా?

సునం—వచ్చి చాలాసే పయినది.

రాధ—ఆహా! ఏమి నాభాగ్యము! నాస్వామి వచ్చినాఁడా! ఇప్పు డెక్కడ నున్నాఁడు?

సునం—ఆసంగతి నా కేమి తెలియును.

రాధ—వచ్చెనని చెప్పితివే!

సునం—వచ్చెను గావునఁ జెప్పితిని.

రాధ—నందుని గృహమున నున్నాఁడా?

సునం—నందుని గృహమునకు వచ్చుటయు వెళ్ళుటయుఁగూడ నైనది.

రాధ—అక్కడనుండి వెళ్ళినాఁడా! హాకృష్ణా! కుహానాగోపాలా! ఎంత మాయకాఁడవు. బృందావనమునకు వచ్చి నందుని మందిరమున నుండి ఈరాధను జూడకుండ నరిగితివా? ఎప్పుడు నీదర్శనభాగ్య మబ్బునో యని గడియ యొకయుగము గాఁ గడుపుచున్న ఈరాధను- భవదీయబాహుపరిరంభణసౌఖ్యాబ్ధి నోలలాడ నువ్విళ్ళూరుచున్న ఈరాధను- ఉక్కడ! మోసపుచ్చి యరిగితివా? శారదా! ఈ నగలన్నియుఁ దీసివేయుము. నాకు వీనితో నేమి పనియున్నది. మఱియొక చీరెఁ దెమ్ము. ఈశృంగారము, ఈయలంకారము, ఈసౌందర్య మపకారులు! సునందా! శౌరి లేని బృందావనంబున నీవ్రతరాత్రి మేల యుండవలయును.

పోమ్ము. సత్వరమ్ముగ మధురఁ జేరికొనుము. నీవా నందనందనుని గాంచి "నీవువచ్చి యెంతయో సంతసము గూర్తువని కంపెడా సతో నెనుగుచూచు మన్న, జేసియుఁ యుగు రాధను- నిరంతరము నీపాదసేవఁ జేయఁ గోరు రాధను ఎప్పుడును నీ బాల్యక్రీడలు, బృందారణ్యవిహారము, యమునానదీసైకతప్రదేశసంచారముఁ దలంచుకొని యానందముందు రాధను—యీరీతి వంచించినందులకు సంతసించితివని చెప్పుము. కృష్ణుని యనుగ్రహమునకుఁ బాత్రురాలు కాని రాధ- ఇఁకఁ గృష్ణునకు దూరమగునని పలుకుము. దూరమగుట యేమి! ప్రాణములు విడుచునని యే చెప్పుము. పొమ్ము, పొమ్ము.

సునం—పోవుట యెక్కడికి?

రాధ—మధురకు.

సునం—ఎందుకు?

రాధ—(శ్రీ)కృష్ణునిఁ జూచి నామాటలు చెప్పుటకు.

సునం—కృష్ణుఁడు మధురయందు లేఁడుగదా!

రాధ—మఱి యెక్కడ నున్నాఁడు?

సునం—ఇక్కడనే యున్నాఁడు.

రాధ—ఇక్కడ లేడని చెప్పితివి కదా!

సునం—నందునిగృహమున లేడని చెప్పితిని.

రాధ—మఱియెచ్చటికేగి యుండును?

సునం—అమ్మా! రాధా!

తే. గీ. కుముదహితు రాకఁ గోరు చకోరములట్లు
నందనందన దర్శనానంద మంద
వేచి యున్న వారిని గారవించి యిటకు
వచ్చుఁ గాఁబోలు గోపాలవల్లభుఁడు.

రాధ—ముఖ్యమైనవారు నావయస్కురాండ్రే కదా?

సునం—అంతకంటె ముఖ్యమైనవారు లేరా?

రాధ—ఎవ్వరు?

సునం—ప్రాత చట్టాలు.

రాధ—గోపికలనియా నీయభిప్రాయము?

సునం—అబ్బా! ఈమాటన్నియు నాకెందుకు? నోరుజారితే పృథ్వి దాటును.

రాధ—మాధవుడు చంద్రావళి గృహమున కరిగెనా యేమి?

సునం—తీగ కదిపితే డొంకంతా కదలును, నానోరు మంచిది కాదు. నన్ను మాటలాడించవద్దు.

రాధ—(శారదను జూచి) శారదా! ఈసునందయొక్క మాటలనుబట్టి నాథుడు చంద్రావళి గృహమున కేగినట్లు తెలియుచున్నది. సునందా! నీవు నాయందు కృపవహించి చంద్రావళి గృహంబునకు—

సునం—సరిసరి. నాకొంపమీదికి దెచ్చిపెట్టకు. కర్మముచాలక నోరు జారినందుకే విచారించుచున్నాను. అక్కడనున్న కృష్ణునికడ కీసమయమున సందేశము గూడ గొనిపోవుదునని నాబ్రతుకు చెప్పనా?

రాధ—పోనిమ్ము. శారదా! నానాథుడెక్కడనుండిన నాకేమి? నాకుసిగ్గేల? నాకు గావలసినది భగవంతుడే. నీ వాచంద్రావళి గృహంబునకే పొమ్ము. నానాథుని విలోకించి నేను చెప్పినట్లుగా ఏమని చెప్పెదవు. ఇటువినుము. రాధాధరపానమోదిత మనోభృంగుండవని తలంచినందుకు దానికి వ్యతిరేకముగా చంద్రావళీయధరపానమోదితమనోభృంగుండవైనందుకు సంతసించితి ననుము. (ఇంచుక యూరకుండి) కాదు. కాదు.

ఆమాట వినినచో నాథున కాగ్రహము రాగలదు. అమ్మహా త్మునకుఁ గోపము గలిగింపరాదు. నే నాతని కృపకుఁ బాత్రురాలను. ఏవిధముగనైన నాతనిని సేవచే బ్రసన్నుని జేసికొనవలెను. పోనిమ్ము. భక్తురాలగు దీనికై బద్ధకంకణుఁడవగు నీకొఱకు- షోడశసహస్రగోపికానాయకుఁడవగు నీకొఱకు- సత్యభామయాజ్ఞయైనఁ గాని బృందావనంబున నడుగుపెట్టుటకు శక్తుఁడవుగాని నీకొఱకు- కుహనాయోగివై యుద్యానవనమున వంచించిన నీకొఱకు- ఇదిగో, ఈయర్ధరాత్రి తప్పక విచ్చేయుదువనునాశతో ఈరాధ వేచియున్నది. సత్వరముగ రమ్ము అని చెప్పుము. (ఇంచుక యూరకుండి) ఊం. ఊం. 'రమ్ము' అను వాక్యప్రయోగములో నాజ్ఞ స్ఫురించుచున్నది. అది తప్పుగాఁ బట్టునే! అతఁడు సేవ్యుఁడు. నేను సేవకురాలను. అమ్మహానీయున కాజ్ఞ నిచ్చుటకే నెంతదాన! నేనే కాదు. చతుర్దశభువనంబులయందును నాతని కాజ్ఞ నిచ్చువా రెవ్వరును లేరు. కావున, అట్లు చెప్పక నీచరణదాసి యగు రాధ భక్తిపూర్వకముగ నీపాద సరోరుహములకు నమస్కరించి యొక్కసారి విచ్చేసి యానందము నొసఁగుమని పలికిన దని నుడువుము. చంద్రావళి గృహంబున నుండుటచే నసూయవహించి రాధ యిట్లు బలికినదని యాతని చిత్తమునకుఁ దోఁచునట్లు చెప్పకుము. పొమ్ము. ఇంకను పోలేదేమి?

సుమ.— అమ్మా! రాధా! నీకుఁ బరికత్తెగాఁ జేసినప్పుడా విరించి ఈశారదకు మఱి రెండుకాళ్ళు చనంబులకును- మనోజవమును గూర్పనందులకును విచారించుచున్నాను. అట్లున్నచోఁ దలఁచిన మాత్రములోనే కృష్ణుఁ దెచ్చుట నున్నను- నీసందేశమును నవలీలగఁ గొనిపోయి యిచ్చుచుండెడిదానఁ గదా. (శారదను జూచి)

శార—ఎందుచేత ?

సునం—ఏమని చెప్పుదును? 'ఇంటిగుట్టు లంకకుచే' టన్నారు. నా భార్య నాకుఁ బరిచర్య చేయునది కాదు. నా చేతఁ జేయించుకొనునదే. అందుచేత అభ్యంగనస్నాన మారుమాసముల కొకసారి యేర్పాటు చేసినది. ఇదేమనుటకు వీలులేదు. గట్టిగ మాట్లాడితినా నాగౌరవము దక్కదు.

(తెరలో వేణుగానము వినవచ్చును.)

రాధ—సునందా ! ఇప్పుడయిన గోపాలదేవుని వేణుగానము వినవచ్చినదా ? దీనింబట్టి యతఁడు వచ్చుచుండెనందునా ?

సునం—ఆ ! ఇప్పుడు వినవచ్చినది.

రాధ—కృష్ణా! రమ్ము. రమ్ము. ఈ సేవకురాలు నీదర్శనమునకై వేచి యున్నది. నీ మురళీరవము వినినయంతనే నా దేహము జలదరించుచున్నది. రాధా కృష్ణా !

తే. గీ. బ్రహ్మగాంధర్వగీతవిభాసితంబు
కలుషహారిణంబు మానసాకర్షణంబు
నైన మురళిని మ్రోగించుమా ! మదీయకోర్కె
నారి; వింకు, ముదము గందు జలజనాభ.

(ఇంచుక యూరకుండి) అదుగో ! అమ్మహానుభావుఁడు వచ్చుచున్నట్లున్నది. శారదా ! నీ వెదురేగి తోడ్కొని రమ్ము. కాదు. కాదు. నేనే పోయెదను. (ఇంచుక నడిచి) ఏమిది ! కానిపింపఁడు. నా గోపాలకృష్ణుఁ డేడి? నా జీవితేశ్వరుఁ డేడి? ఇప్పుడిచ్చోటకు వచ్చుచున్నట్లు బొడకట్టెనే. నాథా! ఇంతలో నా మాయ జేసితివా ? (సునందానిఁ జూచి) సునందా! వేణుగానము నీ కిప్పుడు వినిపించలేదా ?

సునం—వినిపించినది.

రాధ—అట్లయిన నా హృదయవల్లభుఁ డేడి?

నన్నుఁ దలంచుచుండవలె ననుకోరిక చేసిన యట్లు సేయుచుం
దును. పరమనిష్ఠాగరిష్ఠులైన యోగీశ్వరులకైనను దుర్లభుఁడనైన
నన్ను నీధ్యానముచే మనంబున బాధించి వైచితివి. నీకు సకల
శుభములు నిత్యములై యుండు.

సునం—మిత్రమా! ఇన్ని పలుకులు పలికితివి. కాని నా కొక్క సంశ
యము గలుగుచున్నది. దానిని మాత్రము నీవు తీర్పవలయును.
ప్రస్తుతము నీకథకు బృందావనమే రంగస్థలము కావున నిక్కమ
న్న రాధయందు నీ కెక్కువ ప్రేమయా? చంద్రావళియం
దెక్కువ ప్రేమయా? నిష్కల్మషముగఁ జప్పుము.

శారి—వీరివారికిఁ గలహములు పెట్టుటకు నీవు తలఁచిన దానివలె
నున్నాడవే.

సునం—ఏదియైన సంశయము వచ్చినప్పు డడిగి వారించుకొనవలయును
కదా!

రాధ—సునందా!

తే. గీ. గోపికా గోపకుల యందు ♦ గోప్యులందు
సకలజీవులయందును బ్రహ్మమొకండు
వెలుఁగుచుండెడి లోకైక ♦ విభున కెట్లు
వీరువా రను భేదంబు ♦ వెలయు నయ్య.

(కృష్ణుని సమీపించి) కృష్ణా! గోపాలకృష్ణా! అచక్కని శ్రీమైఁ గంటులేమి?
శరీర మరుణ కాంతి వహించినదేమి?

సునం—మరేమియును లేదు. బృందావనమునకుఁ దయచేసి వచ్చు
చుండునందుకు చంద్రావళి మాధవుని శిక్షించియుండును.

రాధ—శారదా! ఆచంద్రావళి యెట్టి సంసురాలు! ఇంత మాట
పరిసమా! అయ్యో! ఇట్టిస్థితియందున్న గోపాలదేవుని ముఖ
కమలము గని కిఁ ఓర్వఁజాలను. నానాథుని శరీర మిట్లయిం

శ్రీరస్తు.

# రాధాకృష్ణ

## తృతీయాంకము.

రంగము.

[శ్రీకృష్ణుని మందిరము ముందు విశాఖయొక్క ప్రవేశము]

విశా—(తనలో) కృష్ణుఁడు బృందావనమునకు వచ్చి యనుమానము లగుటచే, మా రాధ తొందరపడి యేవిధముగనైన నమ్మోహనాత్ముని గొనిరమ్మని నన్నుఁ బంపినది. సహజకోపస్వభావ యగు సత్యభామకు నే నెగిరి నేని రాధయొద్దనుండి సందేశముఁ దెచ్చిన కాంత యని తెలిసిన నాగ్రహించునేమో యని పురుష వేషము ధరింపఁ జేసినది. ఇట్టి కార్యము నెరవేర్చుట మిగుల కష్టము. మాయానటనచక్రవర్తి యగు గోపాలదేవుని సన్నిధియందుఁ బురుష వేషమున నే నెట్లభినయింపఁగలనో తోఁచకున్నది.

సీ. తరుణి నగు నేను వేషంబుఁ ♦ దాల్చి పురుషుఁ
డనుచు భ్రమియింపఁ జేయుఁగా ♦ నగుదు గాని
కంఠరవ మెట్లు మార్పంగ ♦ గలుగుదాన
నెట్లు కార్యసిద్ధిని బొంది ♦ మెగుదాన.

కానిమ్ము. ఈ వేషమున నింతదూరము వచ్చి యాలోచించినందువలనఁ బ్రయోజన మేమియున్నది? ఒకవేళ నా వేషము వాసుదేవు నెదుట బయలుపడినచో నష్ట మేమియు లేదు. రాధ యొనర్చినకృత్యమునకు సంతసించును; కాని సత్యభామ యెఱింగినచో నా ప్రాణములు దక్కవు. (తన శరీరముఁ జూచుకొని) వేషము సరిపోయినది కదా! ఏమియు మఱచిపోలేదుకదా! ఇఁక నమ్మదిగా మందిరప్రవేశ మొనర్చెదను. (కొంచెము నడచి) అహో! మందిరముఁ జేరితిఁ గాంబోలు! (ఎదుటఁ జూచుచు) ఓయీ! ద్వారపాలకా! భగవంతుఁడు వాసుదేవకృష్ణుఁ డేమిసేయుచున్నాఁడు?

[వృద్ధకంచుకి ప్రవేశించును.]

కంచు—(తనలో) అబ్బా! వృద్ధత్వమునఁ గాలము వెళ్లఁదీయుట మిగుల కష్టము. అందులో సేవకావృత్తి కష్టము చెప్ప నలవి కానిది.

తే. గీ. వార్ధకవిశేషమునఁ దేహ ♦ పటిమ తఱిగె
దృష్టిమాంద్యంబు గలిగెను ♦ ధృతి నశించె
దానఁ జిరపరిచయు ♦ డైన వాని
దూరమున నున్న గుర్తింప ♦ నేర నైతి.

భగవంతుఁ డగు వాసుదేవుఁడు నాకు నా ముసలితనమును జూచి యనుగ్రహించి నన్ను ద్వారపాలకునిగా నియమించినాఁడు.

విశా—(కంచుకిని జూచి) కంచుకీ! మాట్లాడవేమి? శ్రీకృష్ణభగవానుఁ డేమిసేయుచున్నాఁడు?

కంచు—ఈతఁ డెవ్వఁడో! మాధవునిఁ జూచుటకు వచ్చియున్నాఁడు కాఁబోలు! కూర్చున్నదే తడవుగా నమ్మహాత్మునిఁ జూచుట కెవ్వరో యొకరు వచ్చుచుందురు. విసుగు లేకుండ నమ్మహాత్ముఁడైరి

కూడ వచ్చినవారి కెల్లఁ దనదర్శన మిచ్చుచునే యుండును. ఏమయినను సరే, కొంచెము సేపు పూరకుండును. గాక ! (కూర్చుండును.)

విశా—ఈతఁడు నామాట వినిపించుకొనలేదు. బధిరుఁడు కాఁబోలు ! (బిగ్గఱగా) యాదవస్వామి యేమిచేయుచున్నాఁడు?

కంచు—పుణ్యకవ్రతము పూర్తియైనదా యని యడుగుచుంటివా? ఆ! నిన్నటితోడనే పూర్తి యైనది.

విశా—(తనలో) ఇదియేమి! నే నొకటి యడిగినఁ దా నొకటి చెప్పుచున్నాఁడు. పుణ్యకవ్రత మేమి? ఈతని మాటలఁజూడఁగఁ బుణ్యకవ్రత మనునది యొకటి వాసుదేవుని గృహమునఁ జేయఁబడినట్లు గాఁదోఁచుచున్నది. (ప్రకాశముగా) కంచుకీ! పుణ్యకవ్రతమని పలికితివే? అది యెట్టిది?

కంచు—పుణ్యకవ్రతమెట్టిదో నీకుఁ దెలియదా! దానిని సత్యభామాదేవిగారు చేసినసంగతి నెఱుఁగవా? నీవు మధురకుఁ గ్రొత్తవానివలె నున్నావే!

విశా—మధురకుఁగాని- మధురనాయకునకుఁగాని నేను క్రొత్తవాఁడను గాను. కాని నేను మధురకు వచ్చి యొకసంవత్సర మైనది. మాది బృందావనము. మాధవసందర్శనార్థమై యరుదెంచితిని.

కంచు—ఓహో! మా గోపాలకృష్ణుని శైశవక్రీడకు రంగస్థల మైన బృందనుండి వచ్చినవాఁడ వగుటచే మాకుఁ బూజ్యుఁడవు.

విశా—అయ్యో! పుణ్యకవ్రతమును గూర్చి చెప్పవైతివే !

కంచు—నారదప్రబోధితురాలై సత్యభామ యావ్రతమును జేసినది. అందు పతిని దాన మిచ్చుట ముఖ్యాంశము.

విశా—ఇది యెట్టికతె! పతిని దాన మిచ్చువ్రత మేదైనఁ గలదా?

నను గర్వమును భంగముసేయుటకు సుమా !

కంచు—మనలో నీమాటఁ గట్టిగాఁ జెప్పకొనరాదు.

విశా—నిజము. నిజము. (ఇంచుక యూరకుండి) కంచుకీ ! నే నిచ్చటఁ దడయరాదు. మరల బృందావనమునకుఁ బోవలయును. నారాక నెప్పుడిగా వాసుదేవున కెఱింగించెదవా ?

కంచు—(నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) ఓయీ ! శ్రీకృష్ణుఁడు మందిరమున మాత్రము లేడు. మందిరోద్యానవనమున కరిగి యున్నాడు. ఇప్పుడే రాఁగలఁడు. మాధవదర్శనార్థమై బృంద నుండి యెవ్వరో వచ్చినారని సత్యభామాదేవిగారు విన్నంతనే, సత్వరముగ నిన్నుఁ గొనికొనిరమ్మని యాజ్ఞాపించినారు రమ్ము.

విశా—(తనలో) ఇప్పుడు నే నేమిసేయుదును. కానిమ్ము జాగ్రత్తగా మాటలాడెదఁ గాక !

(ఇరువురును నిష్క్రమింతురు.)

ప్రదేశము:—సత్యభామాంతఃపురము.

[ప్రవేశము—సత్యభామ, మంజరి.]

సత్య—ఇంతమాత్రమునకే గర్వము వహించినదిగా రుక్మిణి !

మంజ—సందర్భము లన్నియు నట్లు సమకూడినవి. లేకున్న నట్లుండునా ? నారదప్రబోధిత మగు పుణ్యకవ్రతము నీవు సేయుటయే!

సత్య—ఏమయినను సరే, కలహాశనుం డగునారదుని వాక్యము లింక విని యేకార్యమును జేయరాదు. సఖీ ! తోడికాంతలలో నా కెంతచిన్నతనము వచ్చినదే ! కానిమ్ము. మించినదాని కిప్పుడు తూలించినందువలనఁ బ్రయోజన మేమి యున్నది? కాని యెవ్వరును నా ప్రాణేశ్వరుని చిత్తముమాత్రము ద్రిప్పఁజాలరు. ఆ భీష్మకనృపాలపుత్త్రి యొనరించు పరిచర్యలకు సంతసించుఁ

గోరినదిగాక ! ఈతఁ డామెకోరిక కేల యంగీకరించుచుండవల యును. ఇఁక నొకవిశేషము. ఎప్పుడును బాలగోపాలాకృతిని నాథుఁ డాడుకొనుచుండుటవలన నగుచుండవలయునఁట ! ఈసంగతి నీవు వింటివో లేదో ?

మంజ—వినకేమి ! అమ్మా ! క్రొత్త ఆవకాయ మీఁద నున్న భ్రాంతి-ప్రీతిదాని కైన నుండదు కదా !

సత్య—ఆబృందావనమునుండి వచ్చిన పురుషుఁ డింకను రాఁడేమి !

[తెరలో] ఇదిగో ! వచ్చినాఁడు.

[విశాఖుఁడు—ప్రవేశించును.]

మంజ—ఇదిగో ! బృందావనమునుండి వచ్చిన దూత !

సత్య—ఓయీ ! నీవు బృందావనమునుండియే వచ్చితివా ? నీ పే రెవరు ?

విశా—అవును. నా పేరు విశాఖుఁ డందురు.

సత్య—ఇచ్చటకు నీ వరుదెంచిన నిమిత్త మేమి ?

విశా—భగవానుఁ డగు శ్రీకృష్ణుని సందర్శించుటకన్న వేఱునిమిత్త మేమియును లేదు.

సత్య—(రహస్యముగా మంజరితో) నిజముగా నీతఁడు రాధచేఁ బంపఁబడియుండినను నాసంగతి తెలుపఁడు సుమా !

మంజ—మాటలసందర్భమున నారహస్యమును మనము గ్రహింపలేక పోవుదుమా !

సత్య—విశాఖుఁడా ! బృందావనము రాధ కుశలముగ నున్నదా ?

విశా—పూజ్యులగు నందయశోదలను గూర్చియుఁ దక్కిన వృద్ధులను గూర్చియు నడుగకముందు రాధసంగతినే యడిగితి రేల?

మంజ—అడిగిన దోషమా?

విశా—దోష మేమి యున్నది.

సత్య—వాసుదేవపరబ్రహ్మమును దన యపూర్వలావణ్యశృంగారపా శములచేతఁ జిత్తమునఁ గట్టివేసిన దని పేరుగాంచిన దగుటచే నడిగితిని.

విశా—అపూర్వలావణ్యశృంగారపాశములచేతఁ గాదు- ఇట్టి దని వచింప వలనికాని భక్తిచేత.

సత్య—ఓహో! అదియంతయుఁ గేవలము భక్తియేనా!

విశా—స్వామాన్యభక్తి కాదు. నిశ్చలమైనభక్తి- నిష్కళంకమైన భక్తి.

సత్య—ఇట్టి దాభక్తినిఁ గూర్చిన విమర్శనముతో నేమిపని యున్నది. ఇంతకును నామెకుఁ గుశలమే కదా!

విశా—(సంశయించుచు) ఆ! కుశలమే.

సత్య—సంశయించుచుఁ బలుకుచుంటి వేమి? ఆమె కేమైన నస్వస్థత యొదవినదా యేమి?

విశా—గోపాలదేవుని దర్శనము గలుగుచుండకపోవుటయే యస్వస్థత. ఆమె నిరంతరము భగవత్సాన్నిధ్యమునందే యుండఁ గోరుచుండును గదా!

సత్య—(మంజరితో) వింటివా! ఈమాటలవలన నీ వేమి గ్రహించితివి?

మంజ—ఏమున్నది? ఏదియో రాధాసందేశము నిలఁకు గొనివచ్చినని తెలియుచున్నది.

సత్య—అందుల కేమియు సంశయము లేదు. ఈమధ్య రాధ రోగము బాగుగనే కుదిర్చితిని.

మంజ—నీ వేమి చేసితివి?

సత్య—ఆరుమాసములనుండి నాథుని బృందావనమునకుఁ బోనీయక యుండుటయే.

మంజ—ఇప్పుడు బృందావనప్రయాణము మాత్రము తప్పదని నా

యభిప్రాయము. ...న రెన్నియంతరాయములు గలిగించినను నాగదు.

సత్య—కానిమ్ము. (విశారదునిఁ జూచి) విశారదా! నే నెప్పుడును రాధను జూచి యెఱుఁగను. ఆమె యెట్లుండునో యెఱుఁగ వచ్చునా?

విశా—ఎట్లుండుననా?- అందఱివలెనే.

మంజ—ఆసంగతి యందఱికిఁ దెలియును. సౌందర్యమును గూర్చి యీమె యడుగుచున్నది.

విశా—ఓహో!

తే. గీ. వాక్పతి రచితోత్కృష్టానుభవవిశేష
భావకవితశృంగార ప్రబంధమట్టు
లలరు నిరుపమలావణ్యజలధి సుమ్మె
మాధవానురాగసదన రాధ దేవి.

సత్య—(మంజరితో) చెలీ! వింటివా! ఆ రాధ మాధవానురాగసదన యఁట! (విశారదునితో) విశారదా! మాధవానురాగ సదన ఆరాధ యొక్కతయే కాదు. బృందవనంబున్న గోపిక లందఱును మాధవానురాగసదనలే.

విశా—భగవంతుఁ డగు వాసుదేవున కట్టిభేదము లేదు. కాని రాధ శ్రీకృష్ణుని వశ్యునిఁ జేసికొనిన ట్లెవ్వరును జేసికొనఁజాలరు.

సత్య—మంజరీ! గ్రహించితివా? వేశ్య కుండవలసిన గుణము లన్నియు నామెయొద్ద నున్నవనుట కాఁబోలు! అందుక నే నాప్రాణేశ్వరుఁ డామాయవలపులు, మోహచేష్టలు, మృదుమధురవాక్చాతుర్యము మొదలగునవి చూచి మోసపోయి దానికి దాసుఁడై నాడు. (విశారదునితో) ఓయీ! వాక్పతిరచితోత్కృష్టానుభవవిశేషభావకవితశృంగారప్రబంధమువలె రాధ లావణ్య

మును బోల్చితివి. కాని, ముందు చెప్పవలసినది మొగము కదా. దానినిఁ గూర్చి చెప్పలే దేమి?

విశా—అమ్మా! రాధా దరహసితానన ముత్ఫుల్లాబ్జభ్రాంతి నలరు చుండును. ఇంత యేల? ఆ శ్యామసర్వాంగసౌందర్యము నేత్రోత్సవప్రదర్శినియై సకలసౌభాగ్యగరిమ నలరుచున్న దని చెప్పక తప్పదు. ఎంతసౌందర్యము తనకు లేకపోయిన దో సాటి దిందిరానాథుఁ డగు గోపాలుని వశ్యునిఁ జేసికొనుటకు శక్తురా లగునా?

మంజరీ—ధవుఁడు వశ్యుఁ డగుట కేమి? కుబ్జకు వశ్యుఁడు గాలేదా?

విశా—కుబ్జ ననుగ్రహించుట వరప్రదానముగ భావింపఁబడినది. (ఇంచుక యూరకుండి) అమ్మా! నే నరిగి యామునదరంబున శ్రీకృష్ణుని రాకకై ప్రతీక్షించుచుందును.

సత్యా—స్నానార్థమై యేఁగిన యతఁ డిక్కడికే వచ్చును. (మంజరితో) చెలీ! ఈతఁడు రాధాసందేశముఁ గొనివచ్చినా డనుట సత్యము. నాథుఁ డెట్లయినను బృందావనమున కరుగక మానఁడు. ఇందుల కేమి యుపాయము?

మంజ—ఇట్టిసమయమున నీవు ప్రయత్నముఁ జేసినను విఫలమగును.

సత్యా—నా కొక్కయుపాయము తోఁచినది. నాథుఁడు బృందావనమున కరుగుట సత్యమైనచో నతనికిఁ దెలియకుండ మనముగూడ వెంట నరిగి, రాధామాధవుల సంభాషణ విని వత్తము. (ఎదుటఁ జూచి) అదిగో!- నాథుఁడు సునందునితో వచ్చుచున్నాడు.

[శ్రీకృష్ణుఁడు, సునందుఁడు ప్రవేశము]

సునం—మిత్రమా! స్నానము చేయలేను, చలి యని యెంతచెప్పి

నను విసక బలవంతముమీఁద నన్ను స్నానముఁ జేయించితివి కదా !

శ్రీకృ—ప్రాతఃకాలస్నాన మారోగ్యప్రదము. అందులో నీవు బ్రాహ్మణుఁడవు. బ్రాహ్మణుల కుదయస్నానము ధర్మశాస్త్రముల యందుఁ జెప్పఁబడియే యున్నది కదా. దీనివలన నీకు వచ్చు నష్ట మేమి యున్నది ?

సునం—నీ వట్లే చెప్పుదువు. ఈ శీతలస్నానము వలన నాకు జలుబు చేసినచో మాగృహిణి యుపచారము చేయునది కాదు. నావలె నీ కుపచారము విషయమైన బెంగ యేమియు లేదు. ఎన ముండుగురు భార్యలు నీ నోటివెంట నేవిధమైనయాజ్ఞ యెప్పుడు వచ్చునా యని రెప్పలు వాల్చకుండ శ్రీవణరంధ్రములను బెద్దవిగఁ జేసికొని కనిపెట్టి యుందురు.

సత్య—(శ్రీకృష్ణునిఁ జూచి) ఆర్యపుత్రా ! నమస్కారములు.

శ్రీకృ—దీర్ఘసుమంగలీభవ.

విశా—వాసుదేవా ! వందనములు.

సునం—మిత్రమా ! ఈతఁ డెవరో క్రొత్తవానివలె నున్నాఁడే !

సత్య—నీకంటికిఁ గ్రొత్తవాఁడేమో కాని నాథునికిమాత్రము గ్రొత్త వాఁడు కాఁడు. (శ్రీకృష్ణుని ముఖముఁ జూచి) అదిగో ! అటుఁ జూడుము. ఈరాయబారి మొగముఁ జూచినంతనే వాసుదేవుని మొగ మెట్లు వికసించినదో ! అక్కడనుండి వచ్చినవారినిఁ జూచినచో నాథునకుఁ గలుగునానందమునకు మేర లేకయుండును.

సునం—అమ్మా ! నీమాటలు నా కర్థమగుట లేదు. అక్కడనుండి యనిచెప్పితివి. అది యేమి?

సత్య—నీ స్నేహితునినే యడుగుమనుము.

శ్రీకృ—(విశారదుని జూచి) ఓయీ! ఎక్కడనుండి నీరాక?

విశా—(ఊరకొనును).

సత్య—విశారదా! ఊరకొననేల? గయ్యాళి సత్యభామ యున్న దనియా సంశయించుచుంటివి. బృందనుండి యని చెప్పలేవా?

సునం—కృష్ణా! ఇప్పటికిఁ దేలినది. బృందావనమునుండి వచ్చినాఁ డట! పేరు విశారదుఁడని సత్యభామ పిలుపునుబట్టి గ్రహించి తిమి కదా! కాని, యొక్క సంశయముమాత్రము కలిగినది. నీతో నేను బృందావనమునకు—

సత్య—నీవు లేకుండ నాఘుఁడు బృందావనమున కరుగునా? ఆసంగతి నే వదుగనక్కఱలేదు.

సునం—అమ్మా! నా వాక్యము పూర్తిగాకుండనే యేదియో చెప్పి తివి.

సత్య—నీవాక్యపూర్తి యవసరము లేదు. గ్రహించితిని గదా!

సునం—ఏమి గ్రహించితివి?

సత్య—నీతో బృందావనమునకు నేనుగూడ వచ్చెదననియే కదా నీవు చెప్పఁ దలంచితివి?

సున—ఆడవాళ్ళదగ్గఱ నున్నగుణమే యిది. ఎదుటమనిసి నోటినుండి మాట పూర్తిగ రాకమునుపే తమకుఁ దోఁచిన విధముగ మాటలాడుదురు.

సత్య—అట్లయిన నీవు చెప్పఁదలఁచినమాట యేమి?

సునం—నీతో నేను బృందావనమునకుఁ బెక్కుసారులు వచ్చితిని. నీబాల్యస్నేహితుల నందఱినిఁ జూచితిని. ఈ విశారదునిమాత్ర మెచ్చటను జూడలేదని చెప్పఁదలఁచితిని. (కృష్ణునితో) మిత్రమా! చూచితివా? ఈ విశారదుని. నఖండిజాతి పురుషునివలె నున్నాఁడేమి?

విశా—(తనలో) ఈ సునందుఁడు, బోడిజుట్టునకును- కాలి బొటనవ్రేలికిని ముడివెట్టువాఁడు. నా వేషమును నానవాలుపట్టినచోఁ గొంపతీయును. వచ్చినపని త్వరగాఁ దీర్చుకొని యావలఁ బడవలయును.

శ్రీకృ—మిత్రమా! నీపరిహాసవాక్యము లొక్కింతకాల మాపుము.

తే. గీ. బృందనుండి యేతెంచె నానందమున, ని
తండు నన్నుఁ జూడ; నచట నా తల్లిదండ్రు
ల కుశలంబు నే నడిగి యాహ్లాద మొంద
వలదె, మానసంబున నిప్డు పరమసఖుఁడ!

సత్య—తల్లిదండ్రుల మాట కేమి, ముందు ముఖ్యమైనవారి సంగతిఁ దెలిసికొనుము.

సునం—అంతకంటె ముఖ్యమైనవా రెవ్వ రచ్చట?

సత్య—రాధాదేవిగారు!

శ్రీకృ—(తనలో)

తే. గీ. రాధ యనుపేరు నాదు కర్ణములఁ బడిన
యంతనే మానసము హర్షజలధి మగ్న
మగుచుఁ బొంగు గంగాపగామహితజలము
బోసినంతన గాలమి పొంగినట్లు.

(విశారదునిఁ జూచి) విశారదా! బృందావనమున నాతల్లిదండ్రు లగు నందయశోదలు సుఖముగ నున్నారా? న న్నెప్పుడైనఁ దలఁచుచుందురా? నన్నుఁ జూచుటకుఁ దొందరపడుచు రమ్మని చెప్పి పంపిరా?

సత్య—నిన్నుఁ జూచుటకుఁ దొందరపడునది రాధ గాని నందయశోదలు గారు.

విశా—మాధవా! నీవు లేని బృందావనము- అమావసనిశివిధమున నుండును. నందయశోదలు నీ వెప్పు డరుదెంతువా యని కన్నుల

వత్తులుపెట్టుకొని చూచుచుండిరి.

సుతం—విశారదా! గోపకాంతలసంగతిగూడఁ జెప్పుము. మాగోపాల కృష్ణుఁ డచ్చట లేక పోవుటం జేసి, గోపకులు తమసంసారమును గోపికలతో సుఖముగాఁ జక్కపెట్టుకొనుచున్నారు కదా!

శ్రీకృ—(నవ్వును).

సత్య—నాథా! గోపికలసంగతిఁ జెప్పిన నంతనవ్వు వచ్చెనది! (విశారదునిఁ జూచి) విశారదా! అంతయుఁ జెప్పితివి. మాకృష్ణుని వలపులసాని యగురాధను గుఱించికూడఁ జెప్పుము. నే నుంటి నని సంశయించుచుంటివా? నే నావలకుఁ బోదునా?— మంజరీ! ఈతఁడు రాధ సందేశమును నాథునకు రహస్యముగఁ జెప్పునుగాఁబోలు! మన మిక్కడ నుండకుండవలయును. నే నిచ్చట నుండుట నాథుని సంతోషమునకుఁ గూడ భంగము. రమ్ము పోవుదము. (పోఁబోవును).

శ్రీకృ—(సత్యభామ చేయిఁ బట్టుకొని) రమణీ!—

సత్య—ఎందుకు? ఈరమణి యిచ్చట నుండుట మీకుఁ గార్యభంగము. ముందు రాధకుశల మారసి ఉబ్బి తబ్బిబ్బై పనబడవఁ గదా నీకు సత్యభామ కావలయును.

విశా—(తనలో) స్త్రీచిత్తములను వీరించి యాదిమైకవిభుఁగ సృజించినాఁడు కదా!

తే. గీ. తనకొడల నెంత యనురాగ ♦ మునదేఁ జూపు
చుండినను- గాంత యది యేమి ♦ చోద్యమో! యి
జేశ్వరుఁడు పరకాంతతో ♦ ననసినేని
యోర్పు వహియింపక యసూయ ♦ నొందుచుండు.

(ప్రకాశముగా) కృష్ణా! ఆరాధారమణి—

సత్య—వాసుదేవుని సత్వరముగఁ దోడ్కొనిరమ్మని నీకుఁ జెప్పినదా యేమి? నీవు వచ్చిన కార్య మదియేకదా! రాధామాధవసంయోగనాటక మాడించి పుణ్యముఁ గట్టుకొనుము.

శ్రీకృ—విశారదా! "ఆరాధారమణి" యని యేదియో చెప్పఁబోయి యాపివేసితివి.

విశా—ఏమున్నది. నిరంతరము నీ నామస్మరణము- నీ దివ్యమంగళవిగ్రహసందర్శనవాంఛ- తప్ప నామె కన్యచింతనము లేదు. ఎప్పుడును నీసన్నిధియం దామె యుండఁ గోరుచుండును.

సునం—ఇక్కడ నున్న భార్య లెనమండుగురును జాలరా- ఆమెకూడ నిచ్చుటకు రాఁదలఁచినది! చాలు నాయనా! దూరముగ నుండుటయే యామెకు శ్రేయస్కరము. ఇక్కడకు వచ్చెనేని మా సాత్రాజితీదేవి గారు—

సత్య—సునందా! నా పే రెత్తుచుంటి వేమి? రాధ యిక్కడకు వచ్చినచో నే నసూయఁబొందుదు నని చెప్పుటకా యేమి? అట్టి యసూయతో నా కేమిపని యున్నది. ఆముద్దులముదితయందు ననురాగముఁ జూపువాఁ డితఁడు- ఈతనివలన సౌఖ్యమును గాంచునది యామె- మధ్య నా కేమి?

శ్రీకృ—విశారదా! జగన్మాతయు నన్నుగ భావించు, ఆరాధ—

సత్య—విశారదా! ఆరాధనుగూర్చి కొంత చెప్పినను నీతని తనివి తీరదు. ఈసందేశ మొరులకుఁ గాని తెచ్చితివి? ఇంతకంటె నామె నిచ్చుటికే తోడ్కొనివచ్చినచో బాగుండునే!

శ్రీకృ—(నవ్వును.)

సునం—అమ్మా! రమ్మని పలికినచో మన మధురకారాధ తెక్కలు గట్టుకొని వాయువేగమున వాలఁగలదు. కాని, నీయాజ్ఞ లేనిదే యట్టిది జరిగనేని బ్రదుకుఁదెరువుండునో లేదో యని

మాకృష్ణుఁడు సంశయించుచున్నాఁడు.

సత్య—ఏమీ! శ్రీకృష్ణునకు నాయాజ్ఞ కావలయునా? ఔరా! ఏమి మాయకాఁడు! ప్రతివిషయము నాతోఁడఁ జెప్పియే చేయుచుండెనా? అబ్బా! సత్యభామను జూచిన మాధవున కెంత భయము! (కృష్ణునిఁ జూచి) నీవు నన్నుఁ గాంచి భయ మంద నక్కఱ లేదు. ఆరాధను- నీవు జన్మించిననాఁటనుండియు మనస్సు నీమీఁదనే నిలిపియుంచిన రాధను- బాల్యక్రీడలను జూచి మోహించి పెద్దవాఁడ వైనపిమ్మటఁ దన కనుకూలునిఁగఁ జేసికొనవలయునని, "ముద్దు" అనునెపమున చంకఁబెట్టుకొని చరించుచు, నప్పటి కేదోవిధమున మోహముఁ దీర్చుకొనిన రాధను- మహారాజాధిరాజుల తనూజలకన్న నసమానవిలాసవతి యని నీచేఁ దలఁపఁబడుచున్న రాధను- నీకును నామెకును నున్న వయసుతారతమ్యమును గాంచి లోకులు జూచి నవ్వుదురనియైనఁ దలఁపక- సంశయింపక- సిగ్గునొందక- ఈమాటఁ జెప్పుటకు నాకే సిగ్గగుచున్నది; నిన్నుఁ బతిగాఁగోరిన ముసలి గొల్లదొరసాని యగు రాధను—మధురకుఁ బిలిపించుకొనుటకు నాయాజ్ఞ యేల కావలయును! అట్టికోరిక యున్నచో- నప్పుడో కాదు- ఇప్పుడే- ఈక్షణముననే పిలిపించుకొనుము. వాయువేగమునఁ బోవు నశ్వములు బూన్చినరథము బంపుము.

సునం—అమ్మా! అట్టి వేమియుఁ బంపనక్కఱలేదు. ఆమె యిప్పు డిక్కడ లేదా?

సత్య—ఏమి! ఇక్కడనే యున్నదా? అవురా! ఎంతమాయ! నాథా! ఆమె నీపురముననే యెక్కడనో దాచియుంచి పై కిట్లు నటించుచుంటివా? రాధయనిన నీ కింత ప్రేమయా? ఇంత యనురాగమా? ఇంత మోహమా? అక్కటా! నేను నీచే వంచింపఁ

బడితిని. నాయందు నీకు నిష్కళంక మగుప్రేమ యున్నదని తలంచితిని. మహారాజులకన్న నెక్కుడు భాగ్యవంతుఁ డగు సత్రాజిత్తుతనూజ నగు నాకన్న సౌందర్యవిలాసములయందు నారీజనచూళికాభరణ మనిపించుకొనుచున్న నాకన్న శ్రీకృష్ణునకుఁ గడుఁబ్రియముఁగూర్చు నెలఁది యని జనవినుతిఁగన్న నాకన్న- ఆహా! దధిఘృతక్షీర విక్రయమునఁ బొట్టబోసికొను వారికిఁ బుత్రికయైన యారాధ. బృందావనంబున జొన్నకూడు దినుచు, నగరముఖ మెన్నఁడు నెఱుంగక, నాగరికతయన్న నేమో తెలియక యున్న యారాధ-అసమానరూపలావణ్యములయందు సహస్రాంశమైనను నన్నుఁబోలని యారాధ- తన మునలితనమును తెలియనీయకుండుటకై వన్నెచిన్నెలు గలిగించుకొని, మెఱుఁగురంగులు బూసికొని, నిన్ను వంచింప వశ్యునిగాఁ జేసికొనిన యారాధ- అహా! నీ కెక్కువ యయ్యెనా! సరే! ఇఁక సత్యభామ యెందుకు? రాధ యుండినఁ జాలును గదా! ఆరాధయే నీకు సంతోషము! ఆరాధయే నీకు సౌఖ్యము! ఆ రాధయే నీకు మోక్షము! నీకు సమస్తము రాధతోడనే యున్నది ప్రపంచమున నెక్కడఁ జూచినను నీకు రాధయే కనిపించుచుండును. పొమ్ము. రాధయొద్దనే యుండుము. ఆబృందావనమున రాధతోడనే కాపురము సేయుము. సత్యభామను మఱచిపొమ్ము. (చెలికత్తెను జూచి) మంజరీ! మాతండ్రి మాధవునిమాయలోఁ బడినాఁడు. గోపాలుని హృదయము కళంకయుతమైన దని తెలియక- అసమాన విలాసవతులగు భార్యలను జూడక- పల్లెవాళ్ళవాఁడు గొల్లపడుచులఁగూడు జారుఁడని యెఱుంగక- ఐంద్రజాలికునివిధమున నందఱను వాడించు కుహనాగోపాలుఁ డని యరయక- యాతనికి నన్నిచ్చినాఁడు.

సునం—దేవీ! సాత్రాజితీ! రాధ యిక్కడనే యున్నదని నేను చెప్పుటచే నాశుధారగా నెంతకావ్యముఁ జెప్పితి వమ్మా! రాధ యిక్కడనే యున్నదనినమాట కంతరార్థము నీవు గ్రహింపలేకపోయితివి కదా? రాధ నిరంతరము మాధవుని హృదయమునందే యున్నదని నా యభిప్రాయము.

సత్య—(కృష్ణునిఁ జూచి) రాధ నామమును నెప్పుడు హృదయమున నుంచుకొని బెంగఁ గొనుచుండుటకంటె, నామెనే వీపునకుఁ గట్టుకొని తిరుగుచుండుట మంచిది. నాథా! నీచిత్తమామె యందింతలగ్నమై యుండుట కాఁబోలి యేమిమంత్రములు ప్రయోగించెనో కదా!

సునం—అమ్మా! ఇదేదో పెట్టుమందుసంబంధమని నాతలంపు

సత్య—పెట్టుమందుకాకున్న నా నాథున కారాధికయందలి యనురాగ మింతగాఁ దల కెక్కునా?

సునం—ఆ పెట్టుమందు నీతనిచేఁ గ్రక్కించుటకు నే నుపాయముఁ జెప్పుదునా?

సత్య—సునందా! ఉపాయ మేదైనఁ దెలిపి పుణ్యముఁ గట్టుకొనుము. ఆ రాధతో మేము వేగలేకయున్నాము. వార్తలమీఁద వార్తలు! రాయబారులమీఁద రాయబారులు!- అబ్బా! ఒక్కనిముసమైన మధురయం దుండనీయదే. ఎప్పుడును నాథుం దన నెత్తిపైఁ బెట్టుకొని యూరేగవలయునని యనుకొన్నది కాఁబోలు! అగ్ని సాక్షిగ నీతనిం జైకొన్న యర్థాంగులము మే మేమైపోవుదుమని తలంచినదో! కాఁపురమునకు నీతనిఁ జేరనీయకుండఁ జేసి- తానొక్కతె యీతనింగూడి కులుకఁదలఁచినది కాఁబోలు!

శ్రీకృ—(నవ్వుచు) రమణీ! నీ యనవసరమైన వాగ్వ్యయమును జూచి నాకు నవ్వువచ్చుచున్నది.

సత్య—అవునవును. రాధసంగతిఁ జెప్పిన నవ్వు- నావిషయముఁ జెప్పిన విచారము- రాధికామాయమోహపాశబద్ధుఁడవై నన్నింత యెల్లిదంబుగఁ జూచెదవా! ఇట్టికపటాంతఃకరణుఁడవని యెన్నఁడును దలంపనైతినే. ఆహా! మాయ లిక్కడ- మాట లక్కడ, తలఁపు లిక్కడ- వలపు లక్కడ, పొందియిక్కడ- చిత్త మక్కడ, కపట మిక్కడ- యనురాగ మక్కడ.

సునం—అందులకనే- ఆపెట్టుమందుకు విఱుగు డిప్పటికి నాకుఁ దోఁచినది. రాధ తలఁపునకు వచ్చినప్పుడు, ఈతఁడు బృందావనమునకుఁ బోయి వచ్చుచుండుటయే.

శ్రీకృ—(సునందునితో)

తే. గీ. జగమునం దోఁచు ప్రతివస్తు • సమితియందు
గలఁడు వాసుదేవుఁ డటంచుఁ • దలఁచి నన్ను
భజన జేసెడివారికి • వశుఁడ నేను
పెట్టుమందుల పనియేమి • చెలసఖుఁడ!

తే. గీ. బాల్యమాదిగ నాసేవ • పరమమోహ
మంచు మదిని భావించి య•హర్నిశలును
నన్నె చూచుచుండెను కా•రణమున! సఖుఁడ!
వశుఁడనైతిని రాధికా•వనితకేను.

సత్య—మంజరీ! వినుచుంటివా? నాథుని పలుకులు! ఆరాధిక యీతనియం దసమానభక్తిని బూని యహర్నిశ లీతనినే చూచుచుండుటచేత నామాయలాడికి వశ్యుఁడైనాఁడఁట! రాధకున్న భక్తి నాకు లేదని చెప్పుటకే కద యీతఁ డిట్లు పలికినాఁడు! (కృష్ణునిఁ జూచి) ఆహా! రాధముందు నేను బనికిరానిదాననైతినా? ఆనామమున కింత యౌన్నత్య మాయెనా? నాకు నీచస్థానమా! నలుగురిలో నాకుఁ దలవంపులు ఘటిల్లఁ

చేయుదువా? ఇందుల కేనా సత్యభామను వివాహమాడినది? (మంజరినిఁ జూచి) మంజరీ! నే నిచ్చట నుండఁజాలను. పోవుదము పద. ఈతఁడు రాధం దలఁచి- సంతోషపారావారనిమగ్నుఁడై నన్నుఁ జూడకయున్నాడు- రమ్ము. (పోఁబోవును.)

శ్రీకృ—(సత్యభామను వారించి)

మ. నను వీక్షించిన మోముఁ ద్రిప్పఁ దగునే ♦ నామాట లాలించినన్
గనుబొమ్మల్ ముడివేసి యీగతి మహా♦గ్రంబైన దృష్టిన్ నను
న్గినుకన్ జూచెద వేల? సత్కృప నిఁకన్ ♦ వీక్షించి, పద్మాస్య! య
ల్కను వీడంగదె! చేత నైనయెడలన్ ♦ గంజాస్త్రి వారింపవే!

(చేయిఁ బట్టుకొనుచున్నాడు).

సత్య—(చేయి వదలించుకొని) అందుకు రాధ యున్నది. కావలసిన యభీష్టము లన్నియు నామె తీర్చును. నీమన్ననఁ గాంచిన దా రాధికయే కదా! సత్వరముగ బృందావనమున కరుగుము. నీకొఱకు రాధ వేచియుండును. నాజోలి నీకేల? సత్యభామ యేమయిన నీకేల? ఈసత్యభామ శరీరమునుండి కొంచెము ప్రాణము లేచిపోయినచో- హాయిగ- శాశ్వతముగ- రాధతో వినోదించవచ్చును. అప్పుడు నిన్నడ్డుపెట్టువా రుండరు. ఇట్లు పలుకుచుండుటచేత నేకదా గయ్యాళిసత్యభామ యని నాకుఁ బేరు వచ్చినది!

శ్రీకృ—పద్మేందువదనా! ఈ యకారణకినుక యేల? నా ముద్దుల భార్యవైన నీ కేమికొఱత యున్నది? తనమనోధన మంతయుఁ నీకొసంగిన కృష్ణుఁడు- నీయాజ్ఞ నెప్పుడును దాఁటియెఱుఁగని కృష్ణుఁడు- ఎట్టి దుర్లభమయినకోరిక లైనను నవలీలగాఁ దీర్చి నీకృపకుఁ బాత్రుఁ డగుచుండు కృష్ణుఁడు ఇదుగో- చేతులు కట్టుకొని నీయెదుట నిలిచియున్నాడు. కటాక్షేక్షణంబులఁ

బ్రతిమాలఁ జేయును. (బ్రతిమాలుట నటించును).

సున—భార్యాభర్తల కలహమునందు భర్త భార్యను బ్రతిమాలుట దోషముకాదని ధర్మశాస్త్రమునందుఁ జెప్పఁబడి యున్నది. ఇది యుఁగాక 'పట్టిగొడ్డునకు వార్పు లెక్కువ' యనునట్లు సాత్రాజితీదేవి పై కింతతీవ్రముగ మాటలాడుటయేగాని, యంతరంగమున నావంతయు నీపైఁ గోపము లేదు.

శ్రీకృ—నీ వన్నమాట నిశ్చయమే.

తే. గీ. కోప మెక్కువగాఁ జూపు ♦ కుందరదన
యాత్మయం ప్రేమకు నిలయు ♦ మాచు నుండు
తన్నునట్టి గొడ్డే కదా ♦ తప్పకుండఁ
బాలు వృద్ధిగా నిచ్చును ♦ వరసఖుండ!

సత్య—గోపాలుఁడ వగు నీ కీవిషయము పూర్తిగాఁ దెలియును.

శ్రీకృ—నారీమణీ! నీ వకారణముగ నాపైఁ గినుక వహించి యిట్లు పలికెదవు గాని, నేను నీయెడలఁ జేసిన దోష మేమి యున్నది? నీకంటెఁ దక్కినకాంతలయందుఁ జూపిన గౌరవ మేమియున్నది?

తే. గీ. అమరసంతతి కనుభీతి ♦ నంద మొన్న
నుగ్రరణమునఁ బలశైరి ♦ నోర్చి, పారి
జాతమహిజాతమును దెచ్చి ♦ సతి! నీదు
పెరటిచెట్టుగఁ జేయుట ♦ మఱచినావె.

రాధ యను పేరు విన్న నాకు మహానంద మని పలికితివి. నీకంటె సకాంతయందుఁ జూపిన యనురాగ మేమి యున్నది? రాధకంటె నీవె గొప్పదానవు.

సత్య—మాటల కేమి? ఎన్నికైనఁ బలుకవచ్చును.- జారచోరచేష్టలు- మాయమాటలు- నీ కుగ్గుపాలతోఁ బెట్టఁబడినవేగా! నీవు రాధకంటె గొప్పదానవని పలికినంతమాత్రమున- నేను

సంతసింతువా ? వాయం దట్టియును రాగ మున్నచో- వాగొల్ల సుందరినిఁ జూచుటకు- అబ్బా- నెలకుఁ బదిసారులు- తల్లిదండ్రు లను జూచుటకని వంకఁబెట్టుకొని బృందావనమునకుఁ బోవు చుండ నేల ? ఎట్టికార్యము చేసినను నీవు సమర్థించి తప్పించు కొనఁజాలుదువు- పరసత్త్వమునందు ననుభవజ్ఞానము విశేషముగ నున్న యీవల్లవకాంతకంటె నేను గొప్పదాన నగుట యెట్లు ?

శ్రీకృ—

తే. గీ. భక్తి విజ్ఞాన వైరాగ్య • భావవాశి
మాన సమం గట్టగలెను • పాలఁతి రాధ
యిట్టి వేమియు లేని, నీ • కేమి కట్టు
వడితి సౌందర్యమును జూచి • వారిజాక్షి !

సునం—నామిత్రుఁడు చెప్పిన మాటయం దసత్యమేమియు లేదు.

శ్రీకృ—(విశారదునితో) విశారదా ! పూజ్యులగు నందయశోదలు నన్నుఁ జూడఁదలఁచుచున్నారా ! కుమారులపైఁ దల్లిదండ్రుల కుండుప్రేమ వర్ణనాతీతము కదా !

మంజ—(సత్యభామను జూచి) అమ్మా ! భగవానుఁ డగువాసుదే వుఁడు నేఁడు బృందావనమున కరుగునా యేమి ?

సత్య—రాధయొద్దనుండి వార్త వచ్చినపిదప యొక్కనిముషమైనా నికి మధురయందుండఁ గాలు నిలచునా ? హృదయాంచమంతయు నిత నికి రాధాపదమూలియోద నే యున్నది.

శ్రీకృ—రాధా—

సత్య—రాధమీఁద నున్న మోహ మెదట నున్న వ్యక్తి నెవ్వరో గూడ గుర్తింపనీయకున్నదే ! నీకంటికిఁ గనఁబడినవా రెల్లరును రాధలే యగుచుందురా ? ఇదిగో- చూడుము. నేను, రాధను గాను. జారచోరశిఖామణీయము, మాయమాత్రలంత్రి

విద్యావిశారదుఁడును నగు వాసుదేవుని- ధర్మపత్నియని సాక్షిగ వివాహమాడిన సత్యభామను- ఏ కల్లబొల్లిమాటలను నమ్మి తన సర్వస్వము నీ కర్పించిన సత్యభామను- నీ కపటానురాగమునకు సంతసించి మోసపు పరవశము జేసికొనుచున్న సత్యభామను- శ్రీకృష్ణునకుఁ దక్కినకాంతలకంటె నాపైననే యెక్కువ మనురాగము- శత్రువులైనను నాకీజన లోకంబునఁ బాటుపడును సత్యభామను—హాహా! తెలిసినది!

శ్రీకృ—సాత్రాజితీ! నే ననఁదలఁచిన మాట పూర్తిగ వినకుండనే యట్లు పలికిన నే నేమనఁగలను!

సత్య—నీ వనఁదలఁచిన మాట యేమి?

శ్రీకృ—మరియొకమాట యది నీవలె రాధానామకమాట గాదు. సత్యభామతోడనే యున్నది యని చెప్పఁబోయితిని.

సత్య—సత్యభామతోడ నున్నది కనుకనే యిట్లున్నది. ఆదులకే కాఁబోలు. మడిమడికి బృందావనమునకుఁ బరుగెత్తుట! నిద్రయందుఁగూడ రాధికను జూచినట్లు కలవరించుట! కుమా నాగోపాలా! ఎంత నీ కృత్రిమమగు మాటలు!- ఎంత నీయబద్ధములు!- ఎంత నీ కల్లప్రేమ! (మంజరిని జూచి) మంజరీ! ఇతఁడు బృందావనమున కరుగుచు- రాధతోఁ గులుకును.

శ్రీకృ—(సునంగునిత్తో) మిత్రమా!

తే. గీ. నన్నుఁ గూడంగ బృందావనమున రాధ
సజ్జనాశాద్ధ పరితాప • జలధిఁ గూలి
వేచియుండును గావున • వెడలవలయు
నడ్డగించిన సత్య కోపంబు • బడయుదున్న.

తే. గీ. సత్యకును నాగ్రహ మొదవ • సలుపఁజాల
విద్రుమోష్ఠిని రాధను • విడువఁజాల
నుభయతారకమార్గ మేదో! సఖుండ!
సరగ వచియింపుమా నాకు • సంతసమున.

తే. గీ. రాధ పేరు విన్నతోడ • క్రోధరసము
వ్యక్తరూపముఁ దాల్చును • భామయందు
మృదుమధుర వాక్యఘుటికచే • సదమలాంగి
స్వాంతమున శాంతమును గూర్చి • చనఁగవలయు.

సునం — నిజమే. వ్యాపారము రసాభాసు కాఁగూడదు.

సత్య — (కృష్ణునిఁ జూచి) సత్యభామయం దున్న ప్రేమ యిదే. అనురాగ మిదే. కారుణ్య మిదే. అహా! ఏమిసారస్యము! అగ్నిహోత్రిసాక్షిగ నిన్నుఁ గైకొన్నయర్ధాంగి- యొకప్రక్కనుండ- ఎక్కడనో గొల్లపల్లెలో నిన్ను వలచి విరాళఁబడిన గొల్లసాని కుశలవార్తల నరయుచు- గోడమీఁదపిల్లి వాటముగ నెమ్మదిగా బృందావనమునకుఁ బోవుటకుఁ జూచుచుంటివా?- ఇప్పుడు నీవు బృందావనమున కరుగుదువా? ఎందుకొఱకు? ఆ! మఱచితిని. బృంద కేగుటకుఁ గారణ మేమియున్నది. ఎప్పుడును నిన్ను చలిదిమూటవలె భుజములపైఁ బెట్టుకొని యూరేగఁదలఁచిన రాధకొఱకు- భక్తి యనునెపముఁ గల్పించుకొని, నిన్ను మోహసముద్రమున ముంచివేసిన రాధకొఱకు- కట్టుకొన్న భార్యల నందఱిని విడిచి, అఖిలభాగ్యభోగంబులఁ బరిత్యజించి, మధురానగరనివాసము విడిచి, బృందావనమునకు వచ్చి యహర్నిశలు తన్నుఁ గనిపెట్టుకొనియుండమని నీకు బోధించు రాధకొఱకు- మాయవలపులు జూపి తక్కిన భార్యలయందు నిన్నుఁ బ్రేమకు దూరముగఁ జేసిన రాధకొఱకు!-

నాథా! ఏమందువు?- ఏందుకే కద నీవు పోవుట! హామ్మ. హామ్మ.

శ్రీకృ—తరుణీ! ఇటు వినుము. నేను బృందావనమునకు—

సత్య—వినవక్కఱలేదు తెలిసినది. నేను బృందావనమునకుఁ బోయెదనని నాతోఁ జెప్పనేల? నాయాజ్ఞతోఁ నీ కేమిపని యున్నది? నీ విక్కడ పేరునకుమాత్రము యీసత్యభామయొద్ద నున్నను, యింతకుముందే నీమానసపతంగము బృందయందు వ్రాలినది.

శ్రీకృ—ప్రేయసీ! ఆగ్రహింపక యిటు వినుము.

తే. గీ. బృంద యనిన నాకుఁ బరమ ♦ ప్రీతి; బృంద
యందుఁ గలవారలెల్ల నా ♦ కాప్తులబల!
దానిచే బృంద కేగుట ♦ తప్పదయ్యె
ననుమతింపుము పోవఁగ ♦ గినుక విడిచి.

సత్య—అవు నవును- బృందావనమున రాధ యుండుటచే నీకుఁ బ్రీతి యే బృందావనమే కాదు- రాధ యెచ్చటనున్న నాప్రదేశము నీకుఁ బ్రీతికరమే. రాధయొద్దకుఁ బోవుటకు నాయాజ్ఞ యెందుకు? ఆగొల్లముదుసలితోఁ గులుకుటకు నాయాజ్ఞ యెందుకు? ఆవలపులకత్తెతో సరససల్లాపములాడి మైమఱచి యుండుటకు నాయాజ్ఞ యెందుకు? నీ వడిగిన నేమి! అడుగక యున్న నా కేమి!- బృందావనమున కరుగుదువు కాఁబోలు!- రాధను జూచి యానందింతువు కాఁబోలు! రాధాపరిరంభణసౌఖ్యంబున నొడలు మఱచి గంతులిడెదవు కాఁబోలు! బృందావన మంతయు శ్రీకృష్ణమయము జేయుదువు కాఁబోలు! గోపికాయువతుల గృహము లన్నియు గిగ్గోలుపెట్టించెదవు కాఁబోలు!-ఏమైనను సరే!-ఒక్కమాటమాత్రము జ్ఞప్తియం

నుంచుకొనుము. కావలసినంత సావకాశము గల్పించుకొని
యారాధతో మాట్లాడుదువు కదా! - రాధతో మాటలాడు
సమయమున నీవు ప్రేమించుననే మఱచిపోవుదువు. నన్ను
విస్మరింతువు రాధావ్యామోహమునఁ బడి.- యామెతో నన్నుఁ
గూర్చి యేమైన భాషింతువేమో! ఆమెయొద్ద నా పేరైన
నెత్తవద్దు. నాయందలి చెడ్డల విమర్శించ నవసరము లేదు. అట్టి
దానికవకాశము నేను సైరింపఁజాలను సుమా! తెలిసినదా!
మఱచిపోయెదవేమో! మఱువ వలదు. మంజరీ! రాధతోఁ
గూడి వినోదించుటకు బృందావనమునకుఁ బోవుచున్న నాథు
నితో మన కిక్కడ నేమిపని యున్నది? రమ్ము.

(మంజరితో నిష్క్రమించును.)

సునం—మిత్రమా! సత్యభామ యిక్కడనుండి వెళ్లుట వర్షము
గురిసి యాగినట్లున్నది. ఇఁక నీవు స్వస్థచిత్తుఁడవై రాధం
గూర్చి ఈవిశారదునితో సవిస్తరముగ ముచ్చటించవచ్చును.

విశా—గోపాలదేవా! నేను చెప్పవలసిన దేమున్నది. రాధికాసందే
శముమాత్రము వినుము.

సునం—నాహితునకంతకంటెఁ గావలసిన దేమున్నది. శీఘ్రముగ
వినిపింపుము.

విశా—ఇదిగో రాధాసందేశము.

సీ. నీమీఁద మది నిల్పి • నీరాకకై నిరీ
క్షించుచుంటిని సరసీరుహాక్ష!
నీ దివ్యరూపంబు • హృదయఫలకమునందు
నిల్పియుంటిని సదా • నిర్వికార!
మాధవ దయఁ గన్న • రాధ కేలోటు లే
దని గర్వమూనితి • కమలనాథ!

ఇంతకాలము నన్ను ♦ నీకొంత రాకుంట
పాడిగాదు సుమా ♦ కరుణాపూరుష !

తే. గీ. తడవుసేయక నన్నుఁ జూడ ♦ దయను బూని
బృంద కిఁక నీవు రాకున్న ♦ విడుచు దాస
దేహమందలి ప్రాణముల్ ♦ దివ్యతేజ !
యదుకులోద్ధార ! గుణధీర ! ♦ యఘవిదార !

శ్రీకృ—అక్కటా ! రాధ నాకై యెంతపరితపించుచున్నదో కదా !
(సునందుని జూచి)

తే. గీ. చిరవియోగాగ్నిసంతప్త ♦ చిత్తయైన
రాధికకు శాంతిఁగొల్పవి ♦ రాజలీల
బృంద కేగవలయుఁ గాని ♦ వెలఁది సత్య
కినుక కొక్కింత శంకను ♦ గనుచు నుంటి.

సునం—కృష్ణా ! ఇట్టి శంక లన్నియుఁ జూచుకొనుచు నున్నచోఁ గార్యము కొనసాగ సేసాగదు. నీవు బృందావనప్రయాణముఁ బెట్టుకొన్నప్పుడెల్ల—సాత్రాజితీదేవికి నాగ్రహము వచ్చుచుండుట నేఁడు క్రొత్త కాదు. ఇదివఱ కున్నదే.

శ్రీకృ—విశారదా ! బృందావనప్రయాణమునకు సంసిద్ధుల మగుదము రమ్ము.

సునం—నీ ప్రయాణమన్న నెంతయో సన్నాహముఁ జేసికొనవలయును. నా కేమియున్నది. అంగవస్త్రము నడుమునకుఁ గట్టుకొని- చెంబు చేతఁ బట్టుకొని- కఱ్ఱ బుజమునఁ బెట్టుకొని- బయలుదేరుటయే. రమ్ము.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది తృతీయాంకము.

శ్రీరస్తు.

# రాధాకృష్ణ

## చతుర్థాంకము

రంగము: బృందావనము.

[ఉద్యానవనమున రాధ, లలిత ప్రవేశము.]

రాధ—ఏమే లలితా! నాభగవంతుని- నామనోహరుని- ఇప్పుడే యిటకుం దోడ్కొని వచ్చెద నని చెప్పి పోయిన శారద యింకను రాలేదేమి?

లలిత—అమ్మా! వాసుదేవుఁడు వచ్చెనని చెప్పుటచే నీహృదయమునకు స్వస్థత చిక్కినదికదా. బృందావనమునకు వచ్చిన నాథుఁడు నిన్నుఁ జూడకుండఁ బోవునా? వచ్చునంతలోపలనే తొందరయా!

రాధ—ఏకదీక్షగాఁ బతి సమీపమునకు రాకమును పున్న చింత యొక విధమున నుండును; సమీపమునకు వచ్చినప్పుడు దర్శించుటకుఁ గలుగు తొందర యది యొక విధమున నుండును. ఇది యిట్టిదని చెప్పుట కలవి గాదు.

[సత్యభామ, మంజరి ప్రవేశింతురు].

సత్య—మంజరీ! నాథుఁ డింకను రాధోద్యానవనమునకు రాలేదు. నంద యశోదలను జూచివచ్చుట కాలస్యమై యుండును. అదిగో!

అక్కడ మాటలు వినఁబడుచున్నవి. రాధ వచ్చి మాధవుని కొఱకు నిరీక్షించుచున్నదికాఁబోలు! (ఇంచుక నడచుచున్నది).

మంజ—అమ్మా! అట్లుఁజూడుము. రాధ చెలికత్తెతోఁగూడ నక్కడ వేచియున్నది.

సత్య—(చూచి) చెలీ! రాధను జూచినప్పుడేమోయని తలంచితిని గాని- మొత్తముమీఁద సౌందర్యవతియే. నాథుఁడు వచ్చునని కాఁబోలు! తన కున్న నగలన్నియు నొసలునిండ గంగిరెద్దువలె దిగవేసికొన్నది. ఏమాయువేషమునకో- నాథునియొక్క రాగమునకుఁ బాత్రురాలు కావలయును గదా!

మంజ—క్రొత్తగ నట్టిప్రయత్న మక్కఱలేదు. శ్రీకృష్ణుని యనుగ్రహమునకీమె యిదివరకే పాత్రురాలయినది.

సత్య—మన మీ లతానికుంజముచాటున నిలిచియున్నచో నెవ్వరును గ్రహింపఁజాలరు. నాథునకును- రాధకును జరుగు సంభాషణము సాంతము విందము. (కొంచెము చాటునకుఁ బోవుచున్నది.)

మంజ—నీవు చెప్పిన ట్లీప్రదేశము మనము రహస్యముగా దాగియుండుటకు బాగున్నది. వారి మాటలు మనకు వినఁబడుచుండును. మనము నెమ్మదిగా మాటలాడుకొనుచు నున్నచో- మన మాటలు వారికి వినఁబడవు.

రాధ—

తే. గీ. నగరి కేతెంచినట్టి మ ♦ న్నాథుఁ జూడ
తత్తరంబాడుచుండెఁ జిత్తంబు లలిత !
ద్వారముకుదిరిన మనుజుండు ♦ సత్య మెపుడు
బెట్టుదురొయంచు వేచెడి ♦ విధముగాను.

సత్య—మంజరీ! వినుచున్నావా! దీని విరహతాపము. ఊరిలోనికి వచ్చిన నాథునికొఱకు కెంత యుద్విగ్నురాలగుచున్నదో!

లలి—దేవీ! శారదను కృష్ణుని వెంట నుండి తీసికొనిరమ్మని చెప్పితివా?

రాధ—అవును.

లలి—శారద పురుష వేష మెవ్వరైన నిచ్చటఁ జూచి యానవాలుబట్టి రేని పరిహసింతురేమో ?

సత్య—మంజరీ! శారద యేమి! పురుష వేష మేమి!

మంజ—నేనును వదియే యాలోచించుచున్నాను. యేమియు బోధ పడలేదు.

రాధ—లలితా! శారద మంచి నైపుణ్యముకలది. అయ్యది మనయొద్ద నుండి పురుష వేషమున నా ప్రాణేశ్వరుని సన్నిధి కరిగి మరల నిక్కడకు వచ్చువఱకును నాప్రాణములు కొట్టుకొనుచునే యున్నవి.

సత్య—మంజరీ! ఇప్పటికిఁ దెలిసినది. చూచితివా రాధచేసినపని ఈమె దూతగావచ్చిన విశారదుఁడే శారద. అవురా! ఈ రాధ యెంతసాహసురాలు!

లలి—రాధా! శారదను గుఱించి నీకేల భయము.

రాధ—అక్కడ సత్యభామ విశారదుఁడు శారదయని గ్రహించెనేని మనప్రాణములు దక్కవేమో యని. ఆమె మహాకోపస్వభావ. అంతకంటె మఱేమియు లేదు.

సత్య—సత్యభామ విన్నచోఁ బ్రాణములు దక్కవేమో యని నీకు భయమా! ఇదివరకు లేనిభయము నీకిప్పు డేలవచ్చినది? ఇంతకుమున్ను కృష్ణునకు నీ వెన్ని వార్తలు పంపితివి. ఎన్నిసారులు బృందకుఁ బిలిపించుకొంటివి. అప్పుడు నే నడ్డమువచ్చితినా? సత్యభామ కోపస్వభావయంటివి. ఈమె కోపము నిన్నేమిచేసినది. చెలీ! దీనికి నాపై నెంతయసూయయో కంటివా! దీని

నసవలసినపని యేమున్నది ఈరాధ కింత చనువొసంగిన నా నాధుని యనవలెను.

రాధ—(కృష్ణుని నుద్దేశించి) నాధా! వాసుదేవా!

సత్య—ఇదిగో!-నాధుఁడువచ్చి నీపరితాప మార్చును. ఇంతలోఁ బ్రాణములు పోఁగొట్టుకొనకుము.

రాధ—

సీ. ముదమూర నా నాధు ♦ మోహనాకారునిఁ
గంజాత నేత్రుఁ ♦ గాంచు టెపుడొ?
కలుపుదీరఁగ వాదు ♦ కమనీయగుణజాలు
గోపాలకుని దండఁ ♦ గూడు టెపుడొ?
శ్రవణపావన మైన ♦ సంసీరుహాక్షు వా
క్యామృత మానుచు ♦ నలరు టెపుడొ?
పరమమోదము నించు ♦ వసుదేవసూనుని
పరిరంభణము గాంచి ♦ పరగు టెపుడొ?

తే. గీ. వాదు హస్తములకును ధన్యతను గూర్ప
శ్రితజనావను చరణపం♦సేవఁ జేసి
భూరిసంతోషజలధిలో ♦ మునుఁగు టెపుడొ
చెప్పుమా! కాలహరణంబు ♦ జేసె నేల?

లలి—అమ్మా! రాధ! ఊరిముందుకువచ్చి యాలుబిడ్డలకై తొందఱఁ జెందినట్లు, ఇఁక నొక నిముషములో జూడఁ గలుగు గోవిందునకై యింత తొందరపడెదవేల?

రాధ—ఫలాసన్నకాలమునఁ జిత్తముయొక్క వేగిరపాటు నడఁచఁ జాలము.

సత్య—మంజరీ! నాధుఁడు ముందు నంద యశోదలను జూడకుండ నిక్కడకు వచ్చి యున్నచో పాప మీమెకుఁ బరితాపము గలు

గక పోయియుండును. భార్యలనువారలనే కదా తల్లిదండ్రులు!
అందులో సామాన్యభార్య కాదు; వలచి మీఁదఁ బడిన వనిత!
ఇట్టి జారిణి కారాట మెక్కువయుండునులే.

రాధ—హా! కృష్ణా! గోవర్ధనోద్ధారా!

తే. గీ. నీదు చరణసేవకురాలు ♦ నిర్మలాత్మ
సంతతము నిన్నుఁ గనఁ గోరు ♦ సదయహృదయ
నీకునై బెంగఁ గొనియున్న ♦ నెలఁతరాధ
నేల రావేల? వేణుగో♦పాలబాల!

[శ్రీకృష్ణుఁడు, సునందుఁడు, విశారదుఁడు ప్రవేశము.]

విశా—వాసుదేవా! ఇటు రమ్ము. రాధ యాప్రదేశమున నున్నది.

సునం—రాధదగ్గఱకుఁ బోవుటకు మా మాధవునకు నీవు దారులు చూప నవసరము లేదు. ఇతని కివియన్నియుఁ గొట్టినపిండియే.

సత్య—మంజరీ! అదుగో నాథుఁడు! మన సునందునితోడను, దొంగవేషము వేసిన శారదతోడను వచ్చినాఁడు. చెలీ! ఈశారదను జూచిన నా కొడలు మండిపోవుచున్నది. మోహపిశాచముచే నావేశింపఁబడి మొదలు తెలియక స్వైరిణి యగు రాధ తన వలపులకాఁడగు కృష్ణునిఁ దీసికొనివచ్చుటకుఁ బురుషవేషమునఁ బొమ్మని చెప్పినఁ జెప్పఁగాక! సిగ్గువిడిచి యీశారద యందుల కేమని సమ్మతించినది. పోయి శిఖఁ బట్టుకొని రెండు తన్నులు తన్నుదునా?

మంజ—నీ విప్పు డేమియుఁ దొందరపడవలదు. రాధామాధవుల సంభాషణ వినుచుందము.

రాధ—కృష్ణా! నీ వెట్లు కఠినహృదయుఁడవై యుంటివో నీకుఁ దెలియకయున్నదా! నందనందనా! నీయధరసుధారసస్రవంతి నా పాలిటిదై ప్రోషింపఁ జేయుము. వైచియుంటి కస్తుభా

లంకృతముగ భవదీయ వక్షస్థలము నాయొక్క భాగమునఁ బెట్టుము. నీహస్తపద్మములు నాచికురబాధయుకడఁ జేర్పుము. నీమృదు మధుర సల్లాపవాక్యములు నా శ్రవణరంధ్రంబులఁ బ్రవేశ పెట్టుము. నీ కృపాలోకనము నాపై నిరంతరము నెలుపుము.

విశా—మాధవా! రాధ నీకై పరితపించుచున్నది. శత్వరముగ నామె ననుగ్రహింపుము.

సత్య—ఓసీ! శారదా! సిగ్గులేక పురుషవేషము వేసి తార్పుడు కత్తెవై శ్రీకృష్ణు నిటకుఁ దెచ్చితివి కదా!

శ్రీకృ—మిత్రమా! సునందా! సహజసౌందర్యవతియగు నీరాధ నేఁ డెట్లున్నదో కంటివా?

సీ. పరితాపమున నుండు ♦ పారిలేయబింబంబు
గతి మోము వెల్లనై ♦ గాఁలుచుండె
జలసేచనము లేని ♦ లలితవల్లికలీల
సుకుమారదేహంబు ♦ సొక్కియుండె
పంకలిప్తంబైన ♦ వరబిసంబులమాడ్కి
మంజులహస్తముల్ ♦ మాసియుండె
పయిమంచు సోఁకిన ♦ వారిజంబులరీతి
ఘనబాష్పసిక్తలోచనము లుండె

తే. గీ. రాధ కీగతి గల్గఁ గారణ మదేమొ
మదికిఁ దోఁచకయున్నది ♦ మహితసఖుఁడ!

విశా— నిన్నుఁ జూడకపోవుటే ♦ నీరజాక్షి
యట్టు లుంటకుఁ గారణం ♦ బంబుజాక్ష!

శ్రీకృ—ఇందుకు నేనె కారణమా! అక్కటా! రాధకు నేనింత వగపు గల్గించితిని.

సత్య—రాధకు బెంగ లేకుండ వమ్ముల సందడిని విడిచి యిచ్చటనె

కాపురముఁ జేయఁబోయితివా? అహా! రాధను జూచిన యెంత జాలి! చేసికొన్న భాగ్యకాంతఁ జేరఁదీసినదానియంద నురాగ మధిక మందురు- ఇదియే కాఁబోలు!

రాధ—హా! గోపాలకృష్ణా! నందయశోదాతపఃఫలంబా! బృందావనవిహారా! నీసేవకై వేచియున్న యీసేవకురాలిని గరుణింపరావేమి?

తే. గీ. దీన నబలను నాకును ♦ దిక్కు నీవె
యంచు నమ్మినదాన దయానిదాన
రమ్మటంచుఁ గోరినదాన ♦ రాధికాహృ
దయకమలభాస్కరా! యింక ♦ దయను గనవె.

సీ. కరుణారసకలిత ♦ కమనీయనేత్రంబు
లల్లనవిచ్చి న ♦ న్నరయరాదె
పాండురదీప్తులు ♦ భాసిల్ల నొక్కింత
చిఱునవ్వు జూపించి ♦ చెలఁగరాదె
మధురసుధఁ జిలుకు ♦ మృదువచోవైఖరి
సుఖము నామ్ముందటఁ ♦ జూపరాదె
యుల్లంబు సకలంబు ♦ పల్లవింపఁగ నన్ను
స్థిరమైన కృపఁ బూని ♦ చేరరాదె

తే. గీ. చేరి, నాజన్మ సఫలంబు ♦ సేయరాదె
కాంతపై నింత మదిలోనఁ ♦ గరుణ లేదె
రాధికాకాంత దేహంబు ♦ నీది కాదె
మునిజనానంద! నందనందన! ముకుంద!

సునం—మిత్రమా! నీకై యారీతినిఁ బరితపించుచున్న రాధను నింకను జేరవేమి?

సత్య—మంజరీ! రాధ భక్తి పరిపాకమై పాడుచున్నది. ఇదియంతయుఁ గృష్ణునిఁ దన వశము జేసికొనుటకు సుమా! ఇంకను-ముందున్నవి-ఇది చేయు చిన్నెలు!

రాధ—(కృష్ణునినుద్దేశించి) కృష్ణా! రాధాకృష్ణా!

సీ. శారదజ్యోత్స్నలఁ ♦ జక్కఁగా హసియించు
చిఱునవ్వు మోమునఁ ♦ జెలఁగువాఁడ!
భక్తసంతతిపైఁ ♦ బరిపూర్ణకృపఁ జూపు
కమనీయ కమలనేత్రములవాఁడ!
శ్రీవత్సకౌస్తుభ ♦ శ్రీవనమాలికా
లంకృతవక్షస్థలంబువాఁడ!
నీలమేఘచ్ఛాయ ♦ నిరసించు మేనిపై
భాసిల్లు పచ్చని ♦ పటమువాఁడ!

తే. గీ. కర్ణకుండల సత్కాంతి ♦ గండభాగ
ముందు మెండుకొని రుచుల ♦ నలరువాఁడ!
సుమతుల కభయ మిచ్చు హ♦స్తములవాఁడ!
సన్నుఁ గావరా నందుని ♦ చిన్నవాఁడ!

శ్రీకృ—(తొందరగా రాధను సమీపించి)

మ. పరితాపంబును బొంద నేమిటికి ♦ భావంబులో నిన్నునున్
విరహాంభోధిని ముంచి చూచుటకునై ♦ విచ్చేయకున్నట్టి యా
కరుణాదూరుఁడు వాసుదేవుఁ డిదిగో! ♦ కల్యాణి! నీముందటన్
జిరమోదంబున నిల్చె నేలుకొనుమా! ♦ శ్రేయంబులన్ గాంచుమా!

సత్య—విరహాబ్ధిలో ముంచి యింతవఱకును నీయొద్దకు రాకయున్న యాకరుణాదూరుఁ డిప్పుడు నీయెదుట నిల్చినాఁడు; కావున నేలుకొనుమని పలుకుచున్నాఁడు. బృందావనమునకు వచ్చుట యాల

స్వాముల చేసితివని రాధ దండించుచు గాఁబోలు! అహా! గొల్ల దానిని జూచిన నెంతభయము!

రాధ—(సంతోషముతో) నా గోపాలదేవుఁడా! నా యిష్టదైవమా! నా ప్రాణనాథుఁడా! అహా! నా భాగ్యము వర్ణింపఁ దరము గాదు. దేవా! నీచరణదాసి యగు నీరాధ యొసంగు నమస్కారము లందుకొనుము. (శ్రీకృష్ణుని పదములపైఁ బడును.)

శ్రీకృ—రాధా! లెమ్ము నీకు సకల శుభములును చేకూరుఁగాక!

సునం—మిత్రమా!

తే. గీ. నిన్నుఁ జూడక బెంగచే ♦ నెగడు రాధ
మొగము నిన్నుఁ జూచినంతనే ♦ మిగుల నార్త
కాంతి వహియించెఁ జూడుమా ♦ కమలనాథ!
లలితవాసంతలక్ష్మీవిలాసముఁ గని
వృద్ధి వికసించు నుద్యానవీధిఁ బోలె.

శ్రీకృ—తే. గీ. సంతతము నన్నుఁ గోరు నా ♦ సత్య యొక్క-
యడుగయిన పురంబు విడిచి ♦ యరుగనీయ
దందుచే రాఁ దడసితిఁ ♦ సుందరవదన!
శిక్షసేయుము ఏనినిఁ ♦ జేరి వేగ
గఱువుదీరఁగ నొకసారి ♦ కౌఁగిలించి.

(రాధను సమీపించును.)

రాధ—(దూరముగాఁ బోవును.)

సునం—ప్రభుఁడా! గోపాలకృష్ణా! సంభాషణకాలము మించిపోయిన తరువాత వెళ్ళిన ప్రాద్యుమ్నునకు జరిగినంత గౌరవము నీకిప్పుడు రాధవలనఁ గలిగినది.

సత్య—మంజరీ! నాథుఁ డన్నమాట వింటివా? సత్యభామను రానీయక పోయిన కారణమున నీస్వైరిణినిఁ జూడ రా లేదఁట! నాకే రిప్పట

నత్తవలదని చెప్పినను మానలేదు సరిగదా. లేనిదోషముకూడ నాయందీమెయుం దారోపించుచున్నాఁడు. నాథా! ఈసత్యభామను రచ్చకెక్కించి నలుగురిలో నగుబాట్లు సేయఁదలంచితివా! శౌరా! రాధనుజూడఁబోవు నిన్ను వారించితినా! నిన్ను పురంబు విడిచి యడుగైనను నవతలకుఁ బెట్టనీయక యుంటినా! నిన్నుఁ గట్టివేసితినా! రాధయం దనురాగమా! సత్యభామయందు విరాగమా! ఇట్టి యసత్యములేల పలికెదవు! రాధ మెప్పును బొందుటకా! ఛీ! అరకాసయిన విలువ సేయని గొల్లది- నామందిరంబునదాసిగానుండుటకయిన వర్హత లేని గొల్లది- ఎగ్గుసిగ్గులు లేక వయసు గడచినదయ్యు నభినవ కందర్పుఁడవగు నిన్ను వలచినగొల్లది- ఛీ! దీని మెప్పా!- నీకుఁ గావలసినది!

శ్రీకృ—(రాధను సమీపించి)

తే. గీ. నీవు కోరిన కృష్ణుండు • నేఁడు వచ్చి
గాఢపరిరంభణము గోరఁ • గాంచవేల?
రాధికారమణున కీవ • రాభవంబు
తగునె! సద్గుణపేటి! రా • ధావధూటి!

సత్య—రాధాగాఢపరిరంభణము లేకయున్నచో నాథుఁడు నిలువఁ జాలఁడు కాఁబోలు! అందుకనే యీబ్రతిమాలుట- ఈ అనునయింపు; ఈయలుకఁదీర్చుట అంతకుముందు నాథుని కౌఁగిటఁ గిలవరించిన యీ బాలిసకూఁతురు-అతఁడు వచ్చినప్పుడు బెట్టు సరిచేయుచు కొమ్మయెక్కుచున్నది. అబ్బా! జాణ! ఇంద్రజాలికవిద్య లన్నియు దీనియొద్ద నున్నవి.

రాధ—మహానుభావా! ఈరాజవేష మేమి! నాకు దీనితో సాహిత్యరించు టేమి!

తే. గీ. ఐహికాముష్మికసుఖముల • నంటఁగోరు
వారి కైవల్యాది చూపింప • వలయుఁ గాని
భక్తివిజ్ఞానవైరాగ్య • భావ మైన
రాధికకు నేల యీనీతి • రమణ! కృష్ణ!

యదునాథా! ఇహలోక సుఖములు- అనఁగా భోగములు, సంపదలు మొదలగువానిపై నాసవహించి కామరాగాదులయందుఁ జిక్కి నిన్ను సేవించు వారికి మానసానందము గలుగుట కెట్టిరూపమున నీవు ప్రసన్నుఁడవగుచుండవలయును. ఎవ్వరట్టి విషయములయందుఁ జిక్కక నిన్నుఁ గొలుచుచుందురో వారి కీవిషయముంతోఁ జూడఁబోవు.

సత్య— మంజరీ! వింటివా! రాధ నోటినుండి వెలువడిన నుడులు. తన కెట్టి కోరికయునుఁ బ్రియము లేదఁట. ఇహలోకసుఖముల నాసించి సేవించువారికేయఁట. తాను భక్తి విజ్ఞానవైరాగ్య భావయఁట. ఇహలోక సుఖంబులఁ గోరునది సత్యభామయే కావున, నామెయుద్దేశించి పొమ్మని చెప్పుటకు మారుగా నిట్లు బలికినది. ఓసీ! రాధా! సత్యభామ హృదయము నీకేమిఁ గోచరమగును! నేను కామరాగాదులకుఁ జిక్కికొన్నదాననా! నీవు విరాగవా! అవునౌను నే కాఁబోలు! వాసుదేవుఁ డెప్పుడును బ్రక్కనుండవలెనని కోరుచుందువు. ఈతఁడు రాకయున్నచో నెప్పుడు శ్రీకృష్ణ కీర్తనలఁ జాటుచుందు మధురాపురమునకు జాత్రవిధాన వార్తఁ బంపుచుందువు.

రాధ—(శ్రీకృష్ణునిఁ జూచి) స్వామీ! నా కెట్టి రూపమునఁ గోరిక లేదు.

సీ. నెంజచామరుడాలు • నెఱపు నవ్వులవానిఁ
శిరమునఁ బింఛంబు • జెలఁగు వానిఁ
కనకరంగ బాలుకు కోకింటి చూపులవానిఁ
కస్తూరితిలకంబు వాని

కమనీయ కాంచన కంకణంబుల వాఁడు
రమణీయ రత్నహారముల వాఁడు
కరమందు నెప్పుడు మురళి దాల్చెడువాఁడు
భువనముల్ దాచిన బొజ్జవాఁడు

తే. గీ. నంద గోకులమందు నానందముగను
బెరిగి పెద్దైనవాఁడు, గోపికల సిగ్గు
గొన్నవాఁడు, దేవకీదేవి కన్నవాఁడు
నాకుఁ బతియును దైవంబుఁ బ్రాణంబు సుమ్మ
భవ్య మోహన బాలగోపాలమూర్తి!

కావున నా కట్టి రూపమునందే సాక్షాత్కరించి ధన్యురాలిఁ జేయుము. ఇదిగో! నీకు నమస్కరించుచున్నాను. నాకితర రూపములతోఁ బనిలేదు. ఎప్పుడును నట్టి రూపమునే చూడ గోరుచుందును.

సత్య—మంజరీ! దీనిదగ్గఱ నన్నిటికన్న నున్నవే! మోహనబాల గోపాలరూపము కావలయునఁట!

శ్రీకృ—(తనలో) నాబాల్యరూపమునందే చిత్తము నిలిపియుంచిన యీ రాధ కట్టిరూపమునే నాయందుఁ జూపించెదను గాక! (ప్రకాశముగా)

తే. గీ. బాల్యమాదిగ నాపైన భక్తి నిలిపి
సేవల ఘటించుచుండిన చేడె! నీవు
దుర్లభంబేది నీకు నో తోయజాక్షి!
భవ్య బాలగోపాల రూపంబు గనుము.

రాధ—(పరికించి సంతోషముతో) కృష్ణా! నీవే నా ప్రాణనాథుఁడవు. నీవే నా దైవంబవు. దేవా! త్రిజగత్పూజితపాదకమలా! నమస్కారములు. (నమస్కరించుచున్నది.)

శ్రీకృ—రాధా !

తే. గీ. ముదురు మోటైన సత్యకు ♦ భూరిముదము
పరమహర్షము నీకును ♦ బాలలీల
మోదమందు దేనికయిన ♦ భోజపుత్రి
జిహ్వ కొకరుచి యిట్టిదే ♦ చిగురుబోడి!

సత్య—(కోపముతోఁ దొందరగా కృష్ణుని సమీపించి) ఆ! ఏమంటివి? సత్యభామ ముదురుమోటయినదా! నేను నీకంటి కట్లు కనఁ బడుచుంటినా? రాధ నవయౌవనాంగిగఁ దోఁచినదా! అపురా! ఎంత పక్షపాతము!- అభీరవృద్ధకాంతయం దెంతయనురాగము! మహారాజాధిరాజులకన్న భాగ్యవంతుని కూతురగు సత్యభామయం దెంతవిరాగము!- ఈ బానిసకూతురు యెదుట నన్నుఁ దృణీకరించుచు మాటలాడు చుంటివా ?

సునం—(తనలో) అగ్ని లేకుండఁ గొంప పొగచూరి యుండుకొనినది. (ప్రకాశముగా) మిత్రమా! వాసుదేవా! నీవు కాలికి బుద్ధి చెప్పుటకంటె నిప్పుడు చేయవలసిన పని లేదు.

సత్య—(కోపముతో) ఏమి నాథా! మాట్లాడవు? నాయెదుట రాధతోఁ గలుకుటయే గాక నన్ను దూషించు చుంటివా! సత్యభామ ముసలిది, మోటుది యని చెప్పుటకు నీకేమి యవసరము వచ్చినది? తనమగనికొఱకుఁ జెలికత్తెకు బురుషవేషము వేయించి మధురకుఁ బంపించి, నిన్ను రావించుకొనిన యీజారిణి- నీకు బరమయోగ్యురాలుగను దోఁచినదా!

సునం—ఇదేమిటి! సత్యభామ నోటినుంటి క్రొత్తనుడి వెలువడినది. స్త్రీకేమి! పురుషవేషమేమి! మధురకుఁ బంపుటయేమి! కృష్ణుని రావించు టేమి!

శారద—(నిష్క్రమించుచు)

సత్య—అదిగో! ఉచ్ఛిష్టము తిని సేవించు నా శారదకు అబ్బా!- విశా రదుఁడని పేరుపెట్టి- ఛీ!- నలుగురు నవ్వుదు రనియైన లజ్జ లేక దాస్యము సేయుటకుఁ బంపితివా? రాధా! ఇట్టిది యెన్నాళ్ళ నుండి సేయుచుంటివి? ప్రచ్ఛన్న వేషములతో నైన సత్య భామ కన్ను గప్పవచ్చును గదా యని తలఁచితివి కాఁబోలు!

సునం—కృష్ణా! నేను మొదటనే యనుమానపడి విశారదుఁడు శిఖండిజాతిలోని పురుషుఁడని చెప్పినాను.

రాధ—(తనలో) విశారదను గూర్చి యీమె యెట్లు తెలిసికొనినదో కదా!

సత్య—(శ్రీకృష్ణునిఁజూచి) ప్రాణేశ్వరా! ఇన్నిదినముల నుండియు సత్య యందేమో యను రాగముఁ జూపుచుంటివని నేలనుండి నింగివఱ కుఁ బొంగుచుంటిని. ఇప్పటికి నీవు నాయందు చూపుచున్న యను రాగసార్థ్యము తెలిసినది.

శ్రీకృ—సత్యభామా!—

సునం—మిత్రమా! ఏదో సమర్థించి చెప్పఁబోవుచుంటివా యేమి?

తే. గీ. ఆగ్రహాస్వాంత యగు నీమె ♦ కనఘ నీదు
వాక్యములు మఱి యింతకో♦పంబు దెచ్చు
నన్ని పాపోపనిహతుఁడై ♦ యున్నవాని
కెలమి నిష్టాన్న మిడఁ దల ♦ కెక్కు గాదె.

శ్రీకృ—సాత్రాజితీ! నీ కింత కోపంబునకుఁ గారణము నే నూహింపఁ జాలక యున్నాను.

సత్య—కోపమునకుఁ గారణమా! నీ వెఱుంగవా! రాధతో మాట్లాడు నప్పుడు సత్యభామపై లెక్క వలదని చెప్పినమాట మఱచితివా!

శ్రీకృ—ఇప్పుడు నేను నీయెడలఁ జేసిన యపరాధ మేమియున్నది.

సత్య—ఇంతకంటె నేమికావలయును. సత్యభామ ముదురుబోటుయైన

దని చెప్పితివికదా! ఇక్కడ రాధాసత్యభామల సౌందర్య విమర్శనముతో నేమిపని యున్నది.

శ్రీకృ—ఇంతలకా నీ కాగ్రహము!- చూడుము నే నన్నమాట-

తే. గీ. ముకురమోమైన సత్యకు ♦ భూరిముదము
పరమహర్షము నీకును ♦ బాలలీల
మోదమును దేనికయిన ♦ భేదవృత్తి
జిహ్వ కొకరుచి యిట్టిదే ♦ చిగురుబోడి !

ఈమాటలేకద నే నన్నవి. ఇందు నిన్ను దూషించిన దేమున్నది. ముకురమోమైన రూపము సత్యకు ముదమని చెప్పుటయే నాయభిప్రాయము గాని- సత్యభామ ముకురమోటమునదని కాదు.

సత్య—"రంకు నేర్చిన యమ్మ బొంకు నేర్వదా!" జగన్నాటక సూత్రధారివగు నీ వనినమాటలు సమర్థించుకొనలేక పోవుదువా? వాసుదేవుని హృదయము సకల సుగుణములకును నాటపట్టు. అతండు నిరంతరకరుణామయుండు, భగవత్స్వరూపుఁడని తలంచి నాతండ్రి నన్ను నీ కొసంగినందుకు- ఎన్నఁడును నిన్ను విడిచి యుండుటకు సమ్మతింపని సత్యభామను- అందఱిభార్యలకంటె దనయం దెక్కువ యనురాగము భర్తకుగలదని గర్వించు నీసత్యభామను- ఒక్కొక్కప్పుడు పిచ్చికేకలు వేసినను నిష్కల్మషహృదయయైన యీసత్యభామను- అగ్నిసాక్షిగఁ గైకొన్న యీసత్యభామను- అవురా! మిండకత్తె యగు రాధయెదుట- వరుసవావులు లేక- వయసుతలఁపక- మోహమే ప్రధానముగ జూచుకొని, యామోహజలధియందే మునింగి తేలుచు, మఱియొకవిషయము తెలియక నీకానందమును గూర్చుచున్న రాధయెదుట- దూషింతువా?

శ్రీకృ—(సత్యభామను సమీపించి) రమణీ! నేను బుద్ధిపూర్వకముగా

గాని, పరితాపమునఁగాని నిన్నేమియు దూషింపలేము. కాక పోయినను దూషించినట్టి యాగ్రహము బూనియున్నావు అదిగో- నమస్కరించుచున్నాను. ఆగ్రహంబుడిగి ప్రసన్నచిత్త వగుము. (నమస్కరించుచున్నాడు.)

సున——దాసునితప్పు దండముతో సరికదా.

సత్య——(శ్రీకృష్ణుని శిరముపైఁ దన్నును.) నీమాయమాటల నెవ్వరు నమ్మ్మెదరు.

రాధ——అక్కా! అక్కా! ఎంతపనిఁ జేసితివి. నవశిరీషకుసుమపేశలశరీరుని- ప్రివృద్ధనశ్యామలుని నకలామరశిరోమకుటరత్నప్రభా భాసమానచరణకమలుని- సంసారార్ణవకర్ణధారుని- రాధావదనోత్పలపూర్ణచంద్రుని-భగవంతుని-మాగోపాలమూర్తిని- అమ్మా! తన్నితివా? ఎంతపాపము! ఎంతపాపము! ఈమహాను భావున కెట్టి శిక్షయో!

శ్రీకృ——(సత్యభామను జూచి నవ్వుచు)

తే. గీ. సకల మునిజనవిబుధశీర్షములపైన
సంతతము ప్రకాశించు నా ♦ చరణయుగళి
భళిర! పాళిరంబువయి నీ ♦ పాద మిపుడు
దాండవం బాడె వాల్గంటి! ♦ ధన్య వీవు.

సున——అందువేత సత్యభామ కున్నగౌరవ మెవ్వరికిని లేదని చెప్ప వచ్చును.

రాధ——(శ్రీకృష్ణుని సమీపించి) కృష్ణా! నిన్ను నేను చూడఁజాలక యున్నాను. (సత్యభామను జూచి) అక్కా!

సత్య——అక్కా! యని పిలిచెదవేమి? నేను నీకంటెఁ బెద్దదానినఁ గని పించుచున్నదానవా!

సున——అమ్మా! ఈవిషయములో నీవు రాధపై నాగ్రహింపవలదు.

ఆమె జన్మసంవత్సరము మఱచిపోవుటచేత నీవు పెద్దదానవో యామె పెద్దదో తెలియక యట్లు బలికినది.

రాధ—(సత్యభామను జూచి) చెల్లెలా! లోకారాధ్యుం డగు నంద సూతిని దన్ని మొంతపాప మొడిగట్టుకొంటివమ్మా! అక్కటా! మొగ మెట్లుకందినదో చూడుము. కమలంబులంబోలు కన్నుల నుండి జలము వెల్లువచ్చుచున్నవో గనుము. (కృష్ణుని సమీపించి) నాథా! నాపైటచెఱగుచే నద్దుదునా? (అట్లు చేయుచున్నది.)

సత్య—ఛీ! స్వైరిణీ! నీకు సిగ్గు లేదా? మహారాజపుత్రికవగు నేనిచ్చట నుండఁగనే నీవు నాథునితో సరససల్లాపమునకుఁ గడంగితివాం భక్తియును నపముఁ గల్పింపుకొని నానాథుని వశము జేసికొంటివా? ఇదియేనా నీభక్తి.

రాధ—నాథా! గోపాల దేవా!

సీ. మార్గశ్రమమునాయు ♦ మంజులాంకారం! నీ
చరణంబు లొత్తెద ♦ సరగఁ దెమ్ము
అలసియుంటివి యూప ♦ నా? బాహువల్లికా
డోలికయందు నో ♦ పాలబాల!
నిద్రింపుమయ్య నిర్నిద్రకృపానిధీ!
వరకుచమండల ♦ భాగమందు
పూలచేఁ గూర్చితిఁ ♦ బొందుగా సురటి
విసరుదు హాయిగా ♦ జలజనయన!

తే. గీ. చెమ్మగిల్లె మొగము పైట ♦ చెఱగుచేత
నొత్తనా? బత్తితో నీకు ♦ చిత్తమలర
చిక్కుబడినవి కురులన్ని ♦ చక్కఁజేసి
ముడుతునా? పూలదండను ♦ ముద్దుకృష్ణ!

సత్య—రాధా! ఇంత సిగ్గుమాలినదానివా! ఈతని పై మోహము నిన్నుం ధురాలిగఁ జేయుచున్నదే. కులటావృత్తిచే జీవించువారైనను నిట్లు తెగువకుఁ బూనరే. నీవు మా కెక్కడ దాపరించితివి. నా నాథుని బిశాచమువలె నావహించితివే- సత్యభామ యెదుట నుండఁగనే యిట్లు సేయుచుంటివి. లేకున్నచో నీమాధవుని శరీరము గొట్టులబిండివలె సాగదీయుదువు కాఁబోలు! ఇంత నిర్భయమా! ఇఁకనైన జాగ్రత్తగ నుండుము.

రాధ—అమ్మా! నా నాథుఁడగు గోపాలదేవుని సేవించుటకు నే నేల సిగ్గును బొందవలయును. నన్ను గూర్చి యెవ్వ రేమనుకొన్న నేమి! భగవంతుని యెడల నీవు మహాపరాధ మొనర్చినావు. అట్టిది నేను చూడఁజాలను. ఈ మహానుభావుఁడు జగద్గురుఁడు. సర్వప్రాణులయందు నుండువాఁడు. అతఁడు నాప్రాణకాంతుఁడు. అతని నెప్పుడు సేవించుచుందును- పూజించుచుందును- కొలుచుచుందును- దలఁచుచుందును. అట్టివానిని నీవు తన్నితివి. నా కన్నులు కాలిపోవ! నేను చూచితిని. చూచి సహించు టెట్లు? నన్నుగూడఁ దన్నుము. ఇదిగో నాశిరము- నీపాదములముందు బెట్టితిని. (అట్లు జేసి) చూచెద నేమి! సంశయించెద వేమి! నా నాథునకుఁ జేసినశిక్ష నాకుఁ గూడఁ జేసితివేని- నాచిత్త మానందమును బొందును.

సత్య—(తనలో) ఆహా! ఏమిది! శ్రీకృష్ణునియం దీమె కున్న భక్తి- అనురాగము చెప్ప నలవిగాక యున్నది. ఈమెం జూచిన నాకది యొకవిధమగు ప్రేమ జనింపచేయుచున్నది. కారణముమాత్ర మూహింపఁజాలక యున్నాను.

శ్రీకృ—(తనలో)

తే. గీ. నేను సౌందర్యవతిని; న ♦ న్న ధవుంబు
వేఱుపఱుపఁ జూచుచుండు ♦ వెఱ్ఱిగర్వ
మూని యుండిన సత్యకు ♦ నువిద రాధ
వలననే గర్వభంగంబు ♦ వలయు నిపుడు.

సునం—మిత్రమా! ఏదియో యాలోచించుచున్నావే! గతించిన దానికి ఆలోచించినచో లాభము లేదు. మఱలనిట్టిది జరుగకుండ నెమ్మదిగా మధురకుఁ జేరుకొనుట మంచిది. నడవలేకయున్న నెమ్మదిగా నాచేయి బట్టుకొని రమ్ము. ముకుందా! బహుభార్యలవలనఁ గష్టము- ఇది.

రాధ—కృష్ణా! నీకు జరిగిన పరాభవమునకు నే నేమని వగతును. అబ్బా! చూడఁజాలను. నాయంకపీఠిని నొక్కింతకాలము శిరం బుంచి శయనింపుము. విసరెదను.

సత్య—ఛీ! జారిణీ! సిగ్గులేకుండ మాటలాడెద వేల? ఇవతల సత్యభామ యున్నదని యెఱుఁగవా? దేహమున బ్రాణము లుండఁ జూచుకొనుము. ఇంక నెప్పుడును నా నాధునకు రాయబారము లంపకుము. పిలిపించుకొనకుము (కృష్ణునిఁ జూచి) నాథా! నేనెంతకాల మిచ్చట వేచియుందును. రమ్ము- మధురకు బోవుదము. కాదేమి? రాధను విడిచి రాలేవా? పోనిమ్ము. ఆమాట యైనఁ జెప్పుము. నేను మధురకు బోవుటయో- యమునలోఁ బడి ప్రాణముల విడచుటయో చేసెద. నా ప్రాణములు బోవుటయే నీకు మంచిదిలే రాధతోఁ గులుకవచ్చును- ఏమి! రాధా! పంతమేమి: నా నాధుని!- మనోహరా! ఇటు రమ్ము. (చేయిబట్టుకొని తనప్రక్క నిలబెట్టును.)

సునం—అమ్మా! కలుపుత్రాని దేమాయెనఁ దెత్తునా!

శ్రీకృ—(నవ్వును.)

సత్య—(రాధను జూచి) రాధా! ఇదిగో చూచితివా! ప్రాణేశ్వ రుఁడు నాప్రక్కనున్నాఁడు. ఎప్పుడును నీకడ నెల్లి యుండవల యును. నీ వాక్యములు నీతిని మధురముంచి వచ్చినట్లు చేయు టకును తెలిసితివా? అట్లుచేసిన సత్యభామ సైరింపదుసుమా! వింటివా? నామాట! మఱచిపోయెదవు సుమా! మఱచి పోయిన మాట దక్కును- మునుముట్టిన దక్కదు.

రాధ—అమ్మా! నాథుఁడు నీప్రక్క నున్నాఁడనియా పలుకుచుంటివి. సంతోషమే. నాకు నానాథుఁడు నాహృదయమున నున్నాఁడు. నాశిరమునం దున్నాఁడు. కన్నులయం దున్నాఁడు. నామాటల యం దున్నాఁడు.

సత్య—ఈ మిట్టవేదాంత మెక్కడ నేర్చితివి. ఇదియంతయు వనాంతమునఁ దీయుటకే కాఁబోలు! నిష్ఠాగరిష్ఠులైన తాపసులకైనను దెలి యని భక్తియోగము నీకుఁ దెలిసినది కాఁబోలు! భక్తి దేవుని మీఁద- చిత్తము చెప్పలవిగాఁద- ఆహా! ఏమిభక్తి జ్ఞాన వైరా గ్య సంపత్తి!

రాధ—కృష్ణా! అటు చూడుము. నీరాకకు సంతోషమూనుచు నానా తరువులు తమ శాఖాహస్తములచేత నీకుఁ బ్రసూనఫలము లర్పించుచున్నవి. అదిగో! భువనపావన మైన నీయశంబును బాడుచుఁ దుమ్మెదలు నిన్నుఁ జుట్టుకొనుచున్నవి. నీలకంఠవం ద్యుఁడ వగుటచే నీలకంఠము లాడుచున్నవి. ప్రియంబున గోపి కలు చూచువిధమునఁ గురంగములు చూచుచున్నవి. నీవువిచ్చే యుటం జేసి మాకు బరమానందమయ్యెనని నిర్మలసూక్తులఁ బర భృతములు పలుకుచున్నవి. గోపాలకృష్ణా! నేఁడు నీపాదములు సోకుటంజేసి యరణ్యభూరుహంబులేయుఁ బావనమైనది. నానా

లతాతరుసంఘములు కృతార్థములైనవి. నీకృపాదృష్టిచే, నది
శైలఖగమృగంబులు దివ్యకాంతి పొందినవి.

సత్య—ఇవియన్నియుఁ జెప్పినదానవు మాధవుని శిరంబు నీయురంబున నుంచుటం జేసి నీపుట్టువ ధన్యమైనదని చెప్పకొనలేదేమి ?

రాధ—మహానుభావా ! గోపాలదేవా !

మ. పరమాశ్చర్యము నీదు శైశవము చె ◆ ప్పంజాల రవ్వారు నీ
చరణాబ్జాతపరాగరేణువులు శ◆శ్వద్భక్తి సేవించుటన్
మురళీగానవినోదమోహన ముఖాం◆భోజాత మిప్పట్టునన్
జిరమోదంబునఁ జూడఁగోరితిఁ గృ◆పన్ వీక్షింపవే మాధవా !

సత్య—ఓసీ జారిణీ ! నీకు బాల్యమునఁ గృష్ణుఁడు మురళి వాయించిన రూపము గావలయునా ! జారిణివగు నీవనుకొనుచున్న నీతఁడు- ఈ జారశిఖామణి- ముసిముసి నవ్వులు నవ్వుచుండుటకును వెఱపోయినది.

రాధ—అక్కా ! భగవంతుఁడగు నీనందనందనుని జారచోరశిఖామణి యనియా పలుకుచుంటివి. అమ్మా ! ఈతఁడు సామాన్యుఁడు గాఁడు.

మ. సిరి యర్ధాంగి, విలాసమందిరము వి◆స్తీర్ణ ప్రపంచంబు, తా
మరసోద్భూతుఁడు మన్మథుండు, సుతుల్◆ భవ్యుల్ శచీనాథుఁడున్
సురలున్ సేవకులౌ; జగంబున నిటుల్ ◆ శోభిల్లియున్ లీలకై
వర వ్రేపల్లెను జారచోరకృతిమై ◆ వర్తించె సాత్రాజితీ!

(కృష్ణునిఁ జూచి) భగవంతా! వాసుదేవా! నీకీసంగతి జ్ఞాపకమున్నదా?

చ. తరువులు మొగ్గలీనగను ◆ దాపుననుండిన యాశిలాతతుల్
కఱఁగఁగ సాఁగ; గోపకుల ◆ కామినులెల్లరు నీ పిఱుందనే
మఱచి త్వదీయగానరస◆మాధురిఁ గోలుచు బొమ్మలట్లుగా
వరలఁగ నూఁదు వేణువును ◆ బాడవె! గోపకుమారశేఖరా!

చ. పదములు వక్రరీతినిడి ♦ బంగరుచేలము నేల జీర ప
య్యెదమున గాలి వ్రేలాడఁగ ♦ భూమిని వ్రాపి మనోహరంబుగాఁ
పెదవిని వేణువుంచి ఫణి ♦ బృందము ముంగమునటింప గానసం
పద వెలయింపఁ జేసె! యమునా ♦ బాలక! నామది యుల్లసిల్లఁగన్.

తే. గీ. అలకళిందజాతీరంబు ♦ నందు, విమల
సైకత స్థలమందు నిశ్శాసమయమున
గోప గోపికల్ ముదమంద ♦ గోపబాల!
వివన! మోహనగానంబు ♦ వేడ్క-మీఱ.

ఉ. శారద రాత్రులందుఁ గడు ♦ సంతసమేర్పడ నన్నుఁగూడి వా
చారు రుచిప్రకాశమగు ♦ సద్వన భూములఁజొచ్చి గోపికా
వారము సంతసింపఁగను ♦ వన్యములుల్ దనియంగ భవ్య వం
శీరవమాధురిన్ వెలయఁ ♦ జేయవె! శ్రీధర! నందనందనా!

(కృష్ణునిచేయిఁ బట్టుకొనును.)

సత్య—(రాధను జూచి) నాథునిచేయి వదలుము. (కృష్ణునితో) నాథా! నన్ను దీనియెదుటఁ బరాభవము సేయుటకా నేనెంత కిరిబినవు పలుకక. మనమకుఁ బోవుదము రమ్మనిన రాక యున్నావు. రాధ నీకు సంతతారాధనీయ యైనదా! రాధా తనుస్పర్శనంబున నీకు శరీరము పొంగుచున్నదా! మాటలైన వినిపించుకొనని యంత మనుతలో మునిఁగిపోయితివా! అగ్ని సాక్షిగఁ గైకొన్న భార్య యెదుటనుండఁగనే, జారు గొంతులు లేక- ఎవ్వరైన విన్న పరిహాసింతురని యైనఁ దలఁపక- సరసములా! హాస్యములా! పిల్లనగ్రోవి పాటలా! గంతులా! బాలికతోడ- ఆభీరాంగనతోడ- లజ్జావిరహిత యగు కాంతతోడ- అవురా! సాహసము! ఇట్టిది నాకన్నుల యెదుటనేనా! చూడఁజాలను. చూడఁజాలను. మనోహరా! నామొఱ మధు

రకు వచ్చెదవా లేదా! నలుగురిలో నన్ను నగుబాటు చేయుటకేనా వివాహమాడితివి. అయ్యో! నేను వంచింపఁ బడితినే. గే! నేను ఇక్కడి కేళులకు వచ్చితిని. ఈ కన్నులతో- ఈ యకృత్యములు- చూచుటకే కాఁబోలు! అబ్బా! ఇక్కడనున్న కొలఁది నాశరీరము గంప మెత్తుచున్నది. హృదయములో మంట బయలుదేరుచున్నది. నేనిఁక నిముసమైన నిచ్చట నిలువఁజాలను. నాథా! నీవు నావెంట వచ్చెదవా! లేదా! రావా!— ఏమి! పలుకవు! రాధతో నిచ్చటనే కాపురము సేయుదువా! మన కాపురములో- ఆసౌధములు- ఆనందనవనశయ్యానవవారాము విహారములు- ఆ భాగ్యభోగములు- ఆ కాంతలు- అక్కడ లేదా! గొల్లవేషము వేసికొని గోవులఁ గాచుకొనుచు- రాధతోఁ గలిసికొని బృందావనమున నిల్లు గట్టుకొని కాపురము సేయుదువా!— చెప్పవేమి! తలవంచుకొని చూచెదవేమి! నీ యభిప్రాయము వెల్లడింప వేమి? ఏదిగాని యొకటి నిర్ధారణ సేయుము. నాగోవ నేను చూచుకొందును. అదిగో! యమునాస్రవంతి సమీపముననే యున్నది—ఏమందువు—వచ్చెదవా! లేదా! గట్టిగ చెప్పుము. (ఏడ్చుచున్నది.)

సూత్ర—జగడగాడి ఏడ్చిన వారితో నెవ్వరును గెలువఁజాలరు.

శ్రీకృ—(తనలో)

తే. గీ. ఎంత కఠినచిత్త యయిన • నాతకోప
భావయైనను నిజనాథు • వశము జేసి
కొనఁగఁ గొంత దుఃఖించి నంతనె మనంబు
కరఁగు గాదె; నిరుపమముగఁ • బురుషునకును.

పురుషుని వశముఁ జేసికొనుటకుఁ గాంతలకు గన్నీరు నించుచు దుఃఖంచుటకన్న మఱియొక సులభోపాయము లేదుకదా.

తే. గీ. అధికకోపచిత్తయయిన ♦ యతివకే ని
జేచ్ఛపై రాక మొక్కైతి ♦ నెప్పుడొప్పఁ
గఠినచిత్తముఁ బూని నిర్మలుని మతిని
మాటలాడెను వానికే ♦ మమత హెచ్చు.

(ప్రకాశముగా)

తే. గీ. కంటి నీటి బిందువులు పాతకమునఁ గాల్వ
యగుచు బోరఁగా విలపింప ♦ నగు నె నీకుఁ
గొఱఁత గల్గిన దేమి! సేవకుడు విధేయుఁ
డైన వాసుదేవుండు నీ ♦ యండనుండ.

(కౌఁగిలించు కొనును.)

సత్య—ప్రాణేశ్వరా! ఆగ్రహావేశమున నెడలు తెలియక నీయెడలఁ జేసిన నాయపరాధమును మన్నింపుము.

శ్రీకృ—తే. గీ. తరుణి! అపరాధ మదియెంచుఁ ♦ దలఁపు, నధిక
రాగ మాకీతిగా మాటి ♦ యాగ్రహంబు
గలుగఁజేయ నీభంగి శిక్షవిధియించి
నావటంచుఁ బొందెదను నానంద మెలమి.

సత్య—రాధా! చూచితివా! ఇప్పుడు నా నాథుడు నాకెట్లు వశ్యుఁ డైనాడో!

సునం—"దండం దశగుణం భవేత్" అన్నారు.

రాధ—అమ్మా! నీ నాథుని నీవు బాహుబంధముచే వశ్యునిగాఁ జేసికొంటివి. నే నాతనిని నిర్మలచిత్తముచేత- భక్తిచేత- సేవచేత- వశము చేసికొని యుంటిని. ఇంతకంటె నాకుఁ గావలసిన దేమున్నది?

శ్రీకృ—(తనలో)

తే. గీ. రాధపైన నుండిన యనురాగమహిమ
పోవనీయదు మధురకుఁ బోవకున్న
పీడ దీనత్వ; మెట్లైన వెడలవలయు
నన్నిచోట్లను రాధ వన్నెరయఁ జేసి.

సత్య—(తనలో) రాధను జూచిన కొలఁదిని నాకుఁ దొలుతనున్న యసూయ క్రమక్రమముగాఁ దగ్గిపోవుచున్నది.

శ్రీకృ—(రాధను జూచి)

తే. గీ. బ్రహ్మరుద్రులకైన దుర్లభుఁడనైన
నన్ను నీభక్తిచేత మనంబునందు
గట్టిగాఁ గట్టివావు మోదమును గాంచ
జన్మమనఁగను నీయదే జన్మ రాధ!

తే. గీ. పోయివచ్చెద మధురకుఁ బోలఁతిమిన్న
జగమునందున నెల్లెడ సర్వవస్తు
సమితియందు నన్నే చూచు సతివి నీకు
నఖిలశుభములు సంతత మలరుఁగాక!

రాధ—మహాభాగా! దయయుంచుము.

సత్య—నాథా! రమ్ము. (శ్రీకృష్ణుఁడును, సత్యభామ, మాజ
నిష్క్రమింతురు.)

లలి—రాధా! ఇక మన కేమిపని. రమ్ము.

(రాధా లలితలు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.

శ్రీరస్తు.

# రాధాకృష్ణ

## పంచమాంకము.

రంగము:—యమునానదీప్రాంత వనభూమి.

[ప్రవేశము—శారద]

శార—అక్కటా! రాధకుఁ బిచ్చిపట్టినదా యేమి! కృష్ణా! కృష్ణా! యని గంతులువైచుచు వెఱ్ఱిపాటలు పాడుచు మేని యాభరణములన్నియుఁ బాఱవేసి చీనిచీనాంబరముల విడిచి కాషాయవసనము ధరించి 'వలదు వలదు' అని దారి కడ్డమై యెందఱు వారించినను నిలువక మనోవేగమునఁ గేవలము యోగినివలె నిట్లు వచ్చినది. ఇప్పుడు నే నేమి సేయుదును? ఏదారిని బోయినదో కదా! హా! రాధా! రాధా! శ్రీకృష్ణునిపై నున్న ప్రేమ-మోహము-అనురాగము-తుదకు నిన్నీ భంగిని మార్చివేసినవా? రాధా! రాధా! ఎక్కడనున్నావు? పిలిచినఁబలుక వేమి? కృష్ణా! మధురాపురవిహారా! నీమీఁదనే చిత్తము నిలిపియుంచిన మా రాధ నిట్టిస్థితికిఁ దెచ్చుట ధర్మముగునా? కృష్ణా! కృష్ణా!

భంగి నొప్పు నీ మురళీర ◆ వంబు లేమి
గోకులము చిన్నవోయెను ◆ గోపబాల!

తే. గీ. పాలు ద్రావక, కోరక ◆ బుచ్చికొనిన
గనుపులు విషాద మేదురోగా ◆ గొలువనట్లు
నలుదెసలఁ జూచుచున్నవి ◆ స్వామి నీవు
నందనందన! యెందేగి ◆ నావు విభుడ.

తే. గీ. మావిగున్నలపై నుండి ◆ మది గలంగఁ
బాటఁ బాడదు కోవెల ◆ పాటలందు
దుఃఖభావప్రకటనము ◆ తోఁచుచుండ
నీవు గన్పడకుంటచే ◆ నీరజాక్ష!

తే. గీ. మురళి వినరానిహేతు వే ◆ మో యటంచు
బాలహరిణముల్ మేతలన్ ◆ వదలి దెసల
హృదయనిర్వేదమునఁ జూచు ◆ నిపుడు; నిన్నుఁ
జూడ తెలియకుండె నదేల ◆ జలజహస్త!

తే. గీ. లాలనము సేసి ప్రొద్దులు ◆ లేఁ జిగురాకు
సొంపమున నుయ్యెలలూచి ◆ సుభచరిత్ర!
భవ్యభవదీయవేణుర ◆ వంబు సోఁక
కుంటచే మారుతుండు వ్యా ◆ కులమునాగు.

కృష్ణా! ఎక్కడ నున్నావు. ఇదిగో! నీచరణదాసి యగురాధ నిన్నరయుచు నీ వనప్రదేశమునకు వచ్చినది. చూడవేల?

ఉ. గోవుల మేపుచున్ గుసుమ ◆ కుంజము నీడల విశ్రమించి; యి
చ్ఛావిధి వంశనాదమును ◆ సల్పుచు; నీవు గనన్ గృతార్థయౌ
యీవని నొక్కతీవ వయి ◆ యేల జనింపకయుంటి నంచుఁ జిం
తావశచిత్తయౌ చరణ ◆ దాసిని రాధను జూడవా హరీ!

శార—రాధా! నీకు మతిపోయినదా యేమి? ఈవనములోఁ గృష్ణుఁ డెందు కుండునే? అతఁ డిచ్చటకు రాలేదే?

రాధ—అయ్యో! రాకపోవుట యేమి? నీ వట్లు చెప్పిన నే నేమనఁ గలను. ఇంతకు ముందేకదా నాకడ కాతఁడు వచ్చినాఁడు.

సీ. తులసిపూసలహారములు దాల్చి తేమని
మించుమనప్పునఁ గాఁగి లించినాఁడు
కౌశేయవసనంబుఁ గట్టినా వేమని
చీరకొంగుఁ దొలంగఁ జేసినాఁడు
చిక్కుపడెను గురుల్ చక్కఁ జేతు నటంచు
జడలోనఁ బువ్వుముల్ ముడిచినాఁడు
వాడియుండె నిదేల వదనాంబుజం బని వాని
మోము మోమునఁ జేర్చి మురిసినాఁడు

తే. గీ. సరసవాక్య సంభాషణ సలిపినాఁడు
యిప్పుడే నన్ను విడిచి తా నేగినాఁడు
వన్నెకాఁడు దేవకిదేవి కన్నవాఁడు
చూడవె వానిజాడ; నో సుదతి! నీవు.

పొమ్ము. సత్వరముగ నా నాథుని వెదకుము.

శార—అమ్మా! నీనాథుఁ డిక్కడకు వచ్చియుండినఁ గదా నేను వెదకవలయును.

రాధ—రాకేమి! వచ్చినాఁడు గనుకనే నే నతని నన్వేషించుటకు వచ్చితిని.

శార—సఖి! నీచిత్త మొక్కింత చలించియుండుటచే నట్లు పలుకు చుంటివిగాని, మధురలో నున్న కృష్ణుఁ డింతకుముందు నీకడకు వచ్చుట యెట్లు సంభవించినది?

రాధ—నే ననిత్యమాడుచుంటినని తలంచుచుంటివా? చూడుము

తే. గీ. జడను ముడిచిన పూవులు • జరుగలేదు.
అధరమందున గంటులు • నారలేదు.
అక్కలోఁ దన యుంకను • నాగలేదు
పులకలైనను మేనిపైఁ • బోవలేదు.

కృష్ణా! రాధాకృష్ణా!

తే. గీ. యతులు పరమాత్మను దలంచు • నాచరించి
నీకృపం గాంచి ధన్యులై • నారదులు
సతిని యట్లనైతి నీకునై • జలజనేత్ర!
బ్రోవవే దాసురాలిని • బూర్ణకృపను

తే. గీ. మెఱుగు బొడిచిన కరణి న • మేయచరిత!
యిట్లు కనుపించి యంతలో • నట్టి మాయ
మైతి వేమందు; నీజాడ • నరయలేక
తిరుగుచుంటిని, రావేల • తిరుగనేల?

విశా—రాధా! మధురయందున్న మాధవునికొఱకు, నారాట మందుచు నీవనమున వెదకినఁ బ్రయోజన మేమియున్నది. నీ చేష్టలు జూచిన నా కంతకంతకుఁ బరితాపము హెచ్చుచున్నది. నామాట విని యింటికి రమ్ము. మనస్సు చెదరకుండఁ గుదురు పఱచుకొనుము.

తే. గీ. మా మనోహరునకు నొక్క • మధురయే ని
వాసమాచును దలఁపంగ • వలదు నీవు
సర్వలోకంబు లందున • సర్వవస్తు
సమితియందు దలంచుట • సత్య మబల!

(ఇంచుక నడచి) ఆహా! ఇదిగో! ఇదిగో! చూచుచుండుము నామాట

యసత్యమంత్రపూతే. బాగుగఁ బరిశీలింపుము. ఈ పాదచిహ్నము లెవరివి?

సీ. భువనపావన మైన ♦ దివిజ స్రవంతికిఁ
బుట్టిన యిల్లౌటఁ ♦ బొలిచె నెద్ది?
బలిదైత్యనాథు దుర్వార గర్వ మడఁచి
పాతాళమును జేరఁ ♦ బంచె నెద్ది?
బృందారకేంద్ర కిరీటరత్నరుచిచే
నంచితంబుగఁ బ్రకా ♦ శించు నెద్ది?
రాధాసతీమణీ ♦ రమణీయ మానసా
భరణమై సతతంబుఁ ♦ బరఁగు నెద్ది?

తే. గీ. అద్ది నందనందను చర ♦ ణారవింద
యుగ్మ మిదిగో చూడు మిచట ♦ నుండెఁ గనుల
నద్దుకొనుము; నుతింపుమా ♦ యఘములెల్లఁ
బాయు; సకలసౌభాగ్యశు ♦ భములు వొడము.

(సాష్టాంగనమస్కారముఁ జేసి) శారదా! నీవు నమస్కరింపవేమి? పవిత్రమైన నా నాధుని పాదములు సోకుటంజేసి యీ ప్రదేశ మంతయుఁ బావనమైనది. ఈ రజమునకుఁ గూడ మహాప్రభావము గలిగి యుండును సుమా! దీనిచే నా దేహము నలంకరించెద. శిరమున ధరించెద. (క్రింద మన్ను దీసి శరీరమునకుఁ బూసికొని) ఆహా! నాధుని పాదధూళి సోఁకుటంజేసి నా కపరిమితానందము కలుగుచున్నది. నే నిప్పు డెచ్చట నున్నానో తెలియకున్నది. శారదా! వినుము. వినుము. అదిగో! నా ప్రాణేశ్వరుఁ డేదియో పలుకుచున్నాడు. (చెవియొగ్గి) నాథా! ఏమనుచుంటివి?

తే. గీ. "పరమపావన మైన నా ♦ పాదధూళి
దేహమందున శిరమందు ♦ దివ్యమతిని

దాల్చితివి గాన నీజన్మ ♦ ధన్యమయ్యె
యతుల మించిన పదవిని ♦ నందఁ గలవు."

అనియూ, కృష్ణా! నీవు వచించుచుంటివి. నిశ్చయముగా నీ కృపనందిన నేను ధన్యురాలనే. పుణ్యాత్మురాలనే. ఏదీ! ఒక్కసారి నీరూపము జూపుము. నమస్కరించి సంతసించెదను. గోవిందా! చూపవా? చూపవా? సేవకురాలిని నాదరింపవా? ఎండనక వాననక, గుట్టనక చెట్టనక, రాయియనక - రప్పయనక, ఇక్కడి కొండలకు వచ్చితిని! నీకొఱకు - తెలిసినదా? కృష్ణా! నీకొఱకు - అయ్యో! పాపము! నాచరణసేవకురాలు - నన్ను నిరంతరము నమ్మియున్న పరమభక్తాగ్రగణ్య - అమాయకురాలు - అగు నీరాధ - ఈసంధ్యాసమయమున - నాకొఱకు వచ్చినదని జాలి వహింపవా? మన్నింపవా? కృప సింతువా? ప్రేమఁ జెంపవా?

శార—అయ్యయ్యో! రాధా! నీకుఁ జైత్యోద్రేక మధికమైనట్లున్నది. కాకున్న యీవెఱ్ఱియేమి? ఇక్కడ శ్రీకృష్ణుని పదచిహ్నము లున్నవని తెలుపుచు నేవో పిచ్చిపనులు సేయుచుంటివి. నాకేమియుఁ గనిపించుట లేదు.

రాధా—ఏమీ! ఈప్రదేశమున నీకు నాగోపాలదేవుని పాదచిహ్నములు కనిపించుట లేదా! ఇవిగో! నాకన్నులు పెట్టుకొని చూడుము. ఇయ్యవా!

శార—వలదు. వలదు.

రాధ—ఈయదుకులజాతుఁ జూడఁగా భగవానుఁ డగు వాసుదేవుఁడీ మార్గముననే పోయియుండును. నే నాతనిని వెదకి పట్టుకొందును గాక! అతఁడు నన్ను వదలినను- నే నాతనిని విడువను. కృష్ణా! రాధను విడిచి నీ వెచ్చటికి బోయెదవు. రాధ నిన్ను విడుచునని తలంచితివేమో! విడువదు. విడువదు. నిశ్చ

యముగా వినుము. ఇదిగో! రాధ పాటాడుచున్నది. నీపంతమే నెగ్గునో - దీనిపంతమే నెగ్గునో - (ఇంచుక యూరక యుండి) మధుసూదనా! గోపకా! నేను నీతోఁ బంతమాడుట మానితిని. నిన్నుఁ జూచి వలచితి- నిసేవఁ జేయుచుంటిని- నిన్నుఁ బ్రీతిగా వలచితి- యుద్ధించితిని- కాని పంతము కాదు. స్త్రీబాలికిఁ బంతము నేమిపనియున్నది.

శార—రాధా! నీవాక్ప్రవాహము నాపి గృహమునకు రావా? అదిగో! చంద్రోదయముకూడ నైనది. వనమునం దుండఁ దగదు. వెన్నెలలోఁ బాములు- సర్పములు బయలుదేరును.

రాధ—సర్పములా! నన్నేమిచేయును. నా గోపాలకృష్ణుని పేరు వినిన నవ్వి తల యెత్తవు. మా కృష్ణుఁడు కాళీయఫణిఫణా రంగస్థలదేశమున నాట్యమాడిన సంగతి నీ వెఱుఁగవా? పాములసంగతిఁ జెప్పి నన్ను భయపెట్టెదవా? నేను భయమునందను. శ్రీకృష్ణపరబ్రహ్మము నా హృదయమున వసించుచున్నంతవఱకు నా కేవిధమైన భయము లేదు. నీవు పొమ్ము. నేను గృహమునకు రాను. గృహమునందు నాకుఁ బనియేమున్నది. కృష్ణుఁడే నాకుఁ గావలయును. కృష్ణుఁడు లేని బృందావనమున నేనుండను. అతని నీవనమునందుఁ గలిసికొనితీరెదను. ఓహో! కలిసికొనలేనా! ఎక్కడనుండిన నక్కడికే యరిగెదను. (పాడుచు) కృష్ణా! యదునందనా!

తే. గీ. పండువెన్నెల యెల్లెడ ♦ నిండుకొనియె
కంటి కింపుగ నుండె నా♦కాశవీధి
ప్రకృతియంతయు శాంతభా♦వమును దాల్చె
రమ్ము! గోపాలకృష్ణ! యీ ♦ రాధ నేలు.

తే. గీ. రమ్యముగ నుండె శారదరాత్రి యిద్ది
కళలఁ జిమ్ముచుఁ జంద్రుండు • కాంతినించె
నుగ నాయువ్వల్ నీవు నాసంగమునను
రాధకరిచర్ల లాడఁగ • రమ్ము కృష్ణ!

తే. గీ. కోమలాంగి జైఁ పూలకా•కుంజమునకు
వచ్చినా చెల్లమ్మాకుల • పొన్నబిరాన
శారదాసిని నేను సే•వల ఘటింపఁ
బవ్వళింపఁగ రమ్ము గో•పాలబాల!

అయ్యో! ఎంతపిలిచినను బలుకవేమి? మొగముఁ జూపవేమి? అక్కటా! నా కర్మ మింతయేనా? నేను నిన్నుఁ జూడఁజాలనా? శారదా! నా నాథుని జూపవేమి? అతని జాడ నెరయవేమి? నన్నింతలో మాయఁ జేసినాడే! (ఇంచుక నడిచి) ఇదిగో! అశోకవృక్షము. వెన్నెలరాత్రి యగుటచే నానవ్వాలుపట్టునుంటిని. మున్ను నా నాథుఁడు యీవృక్షమును సంకేతనముగ నేర్పఱచి యిచ్చటికి వచ్చి నన్నుఁ గలిసికొమ్మని చెప్పి, తాను నాకంటె ముందు వచ్చి వృక్షాగ్రము నారోహించి, నేను వచ్చునరికి గనఁబడక, ముద్దుత్రిప్పలు పెట్టి తుదకు నవ్వుచు దర్శనమిచ్చి సంతసం బొదవించినాఁడు. అట్లే, యిప్పుడుగూడ నట్లు చేసినాడేమో! వృక్షము నెక్కి చూచెదంగాక!

(వృక్షము నెక్కఁబోవును)

శార—(వారించి) రాధా! రాధా! వృక్షము నెక్కనుంటి వేమి! చెముపురుగు లుండును. అదియునుగాక వాసుదేవుఁడు చెట్టుపై నుండునా! ఇంత యవివేకురాల వగుచుంటివేమి! రాత్రివేళ నెమ్మదిగా గృహమునకుఁ దీసికొనిపోవుదును. రమ్ము. నీకు నమస్కరింతును.

రాధ— ఈవ్యర్థురాలికి నమస్కరించిన లాభ మేమియున్నది. గోపాల మూర్తికి నమస్కరింపుము. అతని కథలం బాడుము. అతనిని కీర్తింపుము. అతనిని జూడఁగోరుము. రా- నా వెంట. ఈతార హారములు- ఈమణికంకణములు- తీసివేయుము. పావనమైన తులసీమాలలు ధరింపుము. ఈ దుకూలము విడువుము. కట్టుము జేగురుగుడ్డ- బయలుదేరుము నాతోడ- కృష్ణుని జూచుటకు—ఏమి! వచ్చెదవా! అబ్బో! నీ వెక్కడవచ్చెదవు. నీవు సంసారభ్రాంతిని విడువలేవు. దధిఘృతక్షీరభోజనాసక్తిని బరిత్యజింపలేవు. పొమ్ము. పొమ్ము. నీకుఁ గృష్ణుఁడు కనిపింపఁడు. నేనే కృష్ణునిఁ జూచెదను.

శాంతి—(తనలో) ఈమె నేచెప్పినమాటలు వినకయున్నది. శ్రీకృష్ణునిఁ గూర్చిన సంభాషణముతప్ప నన్యవిషయము శ్రవణరంధ్రములఁ బ్రవేశించుటలేదు. నే నేమి సేయుదును.

రాధ— నా నాథుఁ డీ యశోకవృక్షాగ్రమున నున్నాఁడేమో! (చెట్టు నుజూచుచు)

శా. అందెల్ పాదములందుఁ గంకణము లా • హ స్తంబులన్ మేనమే
ల్గందం బాదలపింఛమున్ నుదుటపైఁ • గస్తూరికారేఖ మే
లందందాల్చిన నందసూను తరురా•జా! మూర్ఖనీయందు నా
నందం బేర్పడ దాచినావె చెపుమా • నాకున్ ముదం బియ్యఁగన్.

శా. మందన్ మాపటివేళవచ్చి కను బ్రేమన్ నన్ను వీక్షించి నా
చందంబంతయు నాలకించి పరిహా•సంబాడి; గోపాంగనా
బృందం బెంతయుఁ గన్నులెఱ్ఱవడ దన్ • వీక్షింప నన్నే ముదం
బందం జేసెడువాని దాచితివె యా • హా! భూరుహశ్రేష్ఠమా.

(ఇంచుకయూరకుండి) ఏమనుచున్నావు. నీయందులేఁడా! అట్లయిననీతో నాకేమి పనియున్నది. నే నిచ్చటనుండి పోయెదను. (నడచుచున్నది.)

శార—రాధా! ఎచ్చటికి బోవుచుంటివి.

రాధ—గోపాలకృష్ణునిఁ జూచుటకు—

శార—నేను చూపించెదను. నా వెంట రమ్ము.

రాధ—చూపించుము వచ్చెదను. నా దేవదేవుని జూపిన నీకు సమస్కారశతము జేసెదను. ఇదిగో- నమస్కరించెదను.

శార—పైత్యప్రాబల్యముచేత నీకుఁ గన్నులు తిరుగుచుండి యట్టిమాటలఁ బలుకుచున్నావు. ఇట్టికృత్యముల సేయుచున్నావు. కొంచముకాలము కన్నులు మూసికొనుము. (కన్నులుమూయుచున్నది.)

రాధ—అహా! శారదా! నీవెంత పుణ్యాత్మురాలవే! ఓహోహో! ఆదివ్యమంగళ విగ్రహము వర్ణించుటకు నాకుశక్తిలోఁ బదములు చాలకయున్నవి. బాలకృష్ణా! అదుండగమేమి! వల్లవాంగన గృహము జొచ్చి- ఉట్టి యందకపోవుటచేఁ గుండకుఁ జిల్లిఁ గల్పించి- పెరుగుద్రావుటకు నోరు బెట్టుచున్నావా? కానిమ్ము అరుగో వ్రేతలందఱును బయలుదేరినారులే. నీదుండగములు యశోదతోఁ జెప్పి శిక్షింపఁజేయుటకు- రాధ నాశించినప్పుడు యనుకొన్నావు కాఁబోలు- యశోద నిన్ను విడువదులే.

శార—కన్ను మూసినను నీవాక్ప్రవాహ మాగలేదు కదా- అంతకంతకుఁ బిచ్చి యధికమగుచున్నది. (కన్నులపైనుండి చేతులు దీసివేయును.)

రాధ—అయ్యో! శారదా! కన్ను దెఱచినంతనే బాలగోపాలుఁడు మాయమయ్యెనేమి? కృష్ణా! ఐంద్రజాలికుని విద్యలన్నియు రాధయొద్దఁ బ్రయోగించుచుఁ గపటనాటకసూత్రధారియను పేరు సార్థకముఁ జేసికొనుచుంటివా? అక్కటా! రాధయొద్ద నా నీవు మాయలు సేయుట!

మ. జలజాక్షా! ఘన యోగమార్గముల నిచ్చల్ గ్రాలు యోగీశ్వరా
వళికైనన్ భవదీయ మాయ గడవన్ ♦ వశ్యంబుగా దట్టిచోఁ
గలకంఠుల్ భవదీయదాస్యకలనా ♦ కామల్ దరంబా నే, నీ
యల్పప్రజ్ఞల మాయలన్ గడవఁ గృష్ణా! మన్మనోవల్లభా.

(శారదను జూచి) శారదా! నీవు నాకన్నులు మూయుటచేతనే నానాథుఁడు కనిపించినాఁడు. నీవు నా కుపకారమే చేసితివి. కన్నులు తెఱచి నంతనే మరల మాయమైనాఁడు. శారదా! నాయెడలఁ గృపవహించి మఱొక్కసారి నాకన్నులు మూయు. పుణ్యము గట్టుకొనుము. ఏమి యంతువు !

శార—నీకంతకంతకుఁ బిచ్చి యధికమగుచున్నది.

రాధ—నాకుఁ బిచ్చియనుచుంటివా? ఏకపిచ్చా- ప్రపంచమంతయుఁ గృష్ణమయముగఁ జూడవలయునను పిచ్చి.

శార—అమ్మా! నీవు నామాట వినవా?

రాధ—విననేమి! ఏమాటఁజెప్పినను కృష్ణసంబంధమైనదేయైన విందును.

శార—నీకా కృష్ణుని విషయమే చెప్పెదను. నెమ్మదిగా గృహంబునకు రమ్ము.

రాధ—గృహమునకా! నేను వచ్చుటయా! చాలు. చాలు. నా బాల గోపాలుఁడు లేని యాబృందావనమునకు - రసికాగ్రేసర చక్రవర్తియగు నందనందనుఁడు లేని బృందావనమునకు - భక్తజన రక్షణ ధౌరేయుఁడైన గోపాలదేవుఁడు లేని బృందావనమునకు- శారదా! నేను రాను- రాను- రాను. నా నాథుని జూడవలెను. చూచెదను. చూచితీరెదను. తెలిసినదా! నా హృదయము నెఱుఁగకుంటివా? నా పట్టుదలను గ్రహించితివా? ఇఁక బొమ్ము బృందావనమునకు- ప్రియాన్వేషతత్పరనై వచ్చిన నన్ను వారింపవలదు.

శార—(తనలో) అక్కటా! ఈమె దుస్థితికి నే నేమని వగతును. నిరంతరము శ్రీకృష్ణపదసరసీరుహధ్యానముకంటెఁ బ్రపంచమునం దనకు నితరమేమియు లేదని చరించు ఈరాధ- అక్కటా! కృష్ణునిపై భ్రాంతిచే- అక్కటా! భోజనపానీయములు మఱచి, నిద్రకుదూరమై, చీనిచీనాంబరములు గట్టుట మాని, హంసతూలికాశయ్యలను ద్రోసి, కాషాయాంబరము ధరించి, తులసీమాలలే రత్నహారములుగఁ జేసికొని, యీవిధమున బయలుదేరి వచ్చినది. అయ్యయ్యో! కమలపత్రసన్నిభములయిన యీమె చరణము లెంత గందుచున్నవో కదా! విసుగులేక శ్రీకృష్ణనామస్మరణము సేయుచుండుటచే నెంతయుక [illegible] గుసుపోయినది. (కృష్ణుని న ద్రశించి) హా గోపాలకృష్ణా!

రాధ—ఏదీ! ఏదీ! నా గోపాలకృష్ణుఁడు. నీకుఁ గనిపించినాఁడా! నాకుఁ జూపుము. నీవు చూపనక్కఱలేదు. నాకే కనిపించుచున్నాఁడు. ఉండు, ఉండు- అదిగో! శ్రీకృష్ణభగవానుఁడు నాకు సాక్షాత్కరించినాఁడు.

శా. మాలెన్ [illegible] పుదంపు యందమును బింఛంపు గాళ్లకున్ గజ్జెల
శ్రీలంగూర్పఁగ వేణుగానరవమున్ ♦ జెల్వొప్పఁ గావించుచున్
గోలన్ జేతనుబూని మోదమలరన్ ♦ గోపాలకశ్రేణితో
నాలన్ గాచుచునుండెఁ జూడు మదిగో ♦ యాత్మేశుఁడా కృష్ణునిన్.

గోపాలకృష్ణా! ఇప్పటికి నేను కృతార్థురాలనయితిని. నీదర్శనము జేసికొనుటకు నన్నెన్ని తిప్పలుపెట్టితివి. ఇఁక నెక్కడకుఁ బోయెదవు. నిన్ను విడిచెదనా? (కొంతదూరము నడిచి) అమ్మయ్యా! దొరికినావు. మాధవా! ఇదిగో- నీపాదముల కీ సేవకురాలు శిరసా నమస్కరించుచున్నది. (క్రిందపడి నమస్కరించుచున్నది.)

శార—అయ్యయ్యో! ఇదియేమి క్రిందఁబడి యొడలంతయు మన్ను జేసి

కొనుచున్నావు. ఇప్పుడు కృష్ణుఁ డున్నాడని నమస్కరించుచు
న్నావు. ఏడీ! కృష్ణుఁడు.

రాధ—ఇదుగో- నాస్వామియగు వసుదేవసూతి. మహానుభావా!

సీ. ౧. జలజసన్నిభంబైన ని ♦ చరణయుగము
కఠిన నేలను మోపుటకు ♦ కందియుండు
గాన; కృపబూని యిప్పుడు ♦ కమలనాథ
నాశిరంబున బెట్టు మానందమొదవ.

నెమ్మదిగా ముందు కుడికాలు బెట్టుము. తొందరపడవలదు. కఠినమైన నాశిరము దాకి నీచరణములు నవయునుకదా!- స్వామీ! ఎన్నాళ్లకు దర్శనమిచ్చితివి.

నార—రాధా! నీకు మతిదప్పినట్లున్నది సుమా! ఇక్కడ కృష్ణుఁడేడీ?

రాధ—ఇదుగో! ఇక్కడనే యున్నాడు. స్వామీ!

సీ. పరమాన్నభోజన ♦ పానీయములు మాని
యుపవాసకష్టంబు ♦ నొంది యుట్లు
పట్టు దుకూలముల్ ♦ కట్టుట విడనాడి
కాషాయ వసనముల్ ♦ గట్టి యుట్లు
నవరత్నహారముల్ ♦ ధరియించుటలు మాని
తులసిపేరులఁ దాల్చి ♦ చెలగు చిట్లు
భాగ్యభోగంబుల ♦ వర్జించి నిశ్చల
చిత్తవృత్తి నీధ్యానముఁ ♦ జేసి యుట్లు

తే. ౧. వెదకుచు [illegible] నిన్నునె ♦ స[illegible]
చరణసేవకురాలిపైఁ ♦ గరుణఁ [illegible]
యిచ్చినాడవు దర్శనం ♦ బింపుమీర
భక్తసంతానశీల! గోపాలబాల!

స్వామీ! ఇంక నేను నిన్ను విడువను. గట్టిగా నీపాదములు బట్టు
కొన్నాను.

దివ్యచరణ సరసీరుహదాస్యమే మోక్షసౌభాగ్యలక్ష్మీ నిలయమని నమ్మిన రాధ- నీవు కనఁబడని నిముష మొక యుగముగా గడపెను రాధ- అక్కటా! నేఁడు నీకొఱకు సకల సౌభాగ్యములను విడిచి, మందిరావాసము బరిత్యజించి, చీని చీనాంబరముల వదలి, మహనీయమణిమయరత్న భూషణంబుల రోసి, కేవలము యోగినివలె కాషాయాంబరము ధరించి, తులసిపేరులు దాల్చి, యిట్లు బయలుదేరి పోవుచున్నది. కృష్ణా! రక్షింపుము.

రాధ—(యమునానది నుద్దేశించి) హా కృష్ణా! చిక్కితివా! ఈ యమునలో దాగితివా! ఇక్కడ దాగినంతమాత్రముచేత నిన్ను విడిచి పోవుదుననుకొంటివా? విడువను. విడువను. కృష్ణా! నిలు. నిలు. (నిష్క్రమించుచున్నది.)

శార—రాధా! నిలువుము. నిలువుము. యమునలోఁ గృష్ణుఁడుండునా! (పరుగెత్తి) అబ్బా! పరుగెత్తఁజాలకయున్నాను. (పరికించి) హా! ఇఁకేమున్నది. కృష్ణా! ఎక్కడనున్నావు? ఏమూలదాగినావు? రాధయొక్క చిత్తము పరీక్షించుచుంటివా! ఇంకను నేమిపరీక్ష సేయుదువు? ప్రాణములు పోఁగొట్టియా నీవు పరీక్ష సేయుదువు. అదిగో! నీవు యమునలోనుంటివని తలఁచి యందులోఁ బడినది. నందనందనా! రక్షింపుము. దాసురాలిపై దయఁజూపుము. నిన్నుఁదక్క ప్రపంచమున నన్యమెఱుంగని రాధను- వనంబులయందుండు సమస్త పుష్పములచేత నీచరణముల నశ్రాంతము బూజించు రాధను- నాకుఁ జెలికత్తెయైన రాధను- గోపాలదేవా! గోవర్ధనోద్ధారా! రక్షింపుము. రక్షింపుము. ఉయ్యయ్యో! నీటిలోఁ బడి కొట్టుకొనిపోవుచున్నది. (నిష్క్రమించును.)

ఇది పంచమాంకము.

శ్రీరస్తు.

# రాధాకృష్ణ

## షష్ఠాంకము.

రంగము:—మధురాపురము.

[లలిత ప్రవేశము]

లలిత—(తనలో) ఏమికారణమో గాని ఈమధ్య కొన్ని దినములనుండి మా సత్యభామా దేవిగారికి కొంచెము కోపము తగ్గినది.

[తెరలో]

లలితా! నిలువుము. నిలువుము.

లలి—ఎవ్వరో పిలుచుచున్నవారు. (పరికించి) ఓహో! సునందా ఏమి?

సునందా—(ప్రవేశించి) ఏమి లలితా! ఎక్కడికో తొందరగా బోవుచున్నావు.

లలి—తొందరపనులు కొన్ని తగ్గినవి కదా!

సున—అవునవును. నేనును నట్లే వినియుంటిని. లలితా! ఇందులకు గారణము నీవు చెప్పగలవా?

లలి—కారణము నాకును గోచరము గాలేదు. కాని యొక్క విషయము

మాత్రమున్నది. ఆమన్న బృందావనమున శ్రీకృష్ణుని తన్ని నప్పుడు రాధ చింతఁ బొంది కృష్ణునియందుఁ జూపిన భక్తినిఁ జూచిన నాఁటనుండియు నీకు కొంచెము శాంతభావము వహిం

సున.—నిజము. నిజము. కాని ఆమె చేష్టలకు కృష్ణుఁడు సైరించి యూరకొనుటవలన చేతగాని వాఁడని భావింపరాదు సుమా! సత్యభామ [illegible] నాతఁడు [illegible] నదగనిచ్చి, [illegible] సమూలముగఁ బెల్లగించి వేయఁదలఁచియే యట్లు [illegible] శాంతము దాల్చియున్నాఁడు.

లలి.—నీవు చెప్పినది నిజమే యై యుండును. కాని సత్యభామమాత్రము వట్టి యమాయకురాలు. అందుచేతనే అంతకోపము. కాని ఆకోపమును నేవిషయమున నేవిధమునఁ బ్రయోగింపవలయునో తెలియదు. మగనిని దండించుటచేతను, దూషించుట చేతను, తన్నుటచేతను, నాథునకుఁ గోపము హెచ్చునా?

తే. గీ. భర్త యవమానమును గాని ♦ [illegible] యెడ [illegible]
భక్తి [illegible] ప్రేమఁ జూపించి ♦ [illegible]
గాని, [illegible] ♦ [illegible]
[illegible] ♦ [illegible]
నింత రాసిన కురుపంక్తి ♦ యొసఁగుఁ గాని
[illegible] వృద్ధి ♦ [illegible].

సున.—అంతమాత్రపు జ్ఞానము సత్యభామకున్నచో నీతిప్ప లెందుకు వచ్చును. రాధను జూడుము. ఆమె భక్తిలో, కృష్ణునియందుఁ జూపునను రాగములో, వినేయతలో, సత్యభామకు సహస్రాంశ మైనను లేదు. దానికితగినట్లుగానే కృష్ణుఁడు గూడ నిరంతరము

రాధికాహృదయపీఠమున వసించుచున్నాను. ఈవిధముగా నా
రాధ తనజన్మమును సార్థకపఱచుకొనుచున్నది.

లలిత—ఆ! మా సత్యభామకగాదా !—

సున—అప్పుడప్పుడు. మానిని దన్నుటచే తనజన్మము సార్థకపఱచుకొ
నుచున్నది. ఇదియే కదా నీవు చెప్పఁదలఁచినమాట.

లలి—సునందా! సత్యభామ చేసిన చేయుఁగాక! నీవిట్లు బలుకుదువా?

సునం—కొంపతీసినావు. ఎప్పుడయినా మాటల సందర్భములో నే ని
ట్లంటి నని సత్యభామతోఁ బలుకకు సుమా! నాప్రాణములు
నిలువున దీసివేయును.

లలి—నీకొకనాఁడు సత్యభామవలనఁ బరాభవము జరుగునప్పుడు చూడ
వలయునని నాకు మిగుల కోరికయున్నది.

సునం—ఇదివఱ కెన్నిసారులు చూడలేదు. నోటమాటజారినది కాని
నీవు దీని నంతగా పాటింపవలదు. (ఇంచుక యూరకుండి) సరే
గాని- మాధవుఁ డిప్పు డేమిసేయుచున్నాడు.

లలిత—సత్యభామాదేవితో మందిరమున నున్నాడు. ఏదో విషయము
మాట్లాడుచున్నాడు.

సునం—మరల బృందావన ప్రయాణ మేమైన యున్నదా యేమి!
ఈసారి బృందావనమునకుఁ గృష్ణుఁడు పోఁదలఁచినచో సత్య
భామ వారింపదని నాయభిప్రాయము.

లలి—వారింపదు. రాధయందుఁగూడ నామె కదిగొప్ప విధమైన యను
రాగము కలిగిన ట్లామె మాటలవలనఁ దెలియుచున్నది.

సునం—సరే. నే నిప్పుడు కృష్ణుని యొద్దకుఁ బోయెదను.

లలిత—నాకును వేళయైనది. నీవు కనిపించినచో నేదో యనవసరసం
భాషణఁ గల్పింతువు. (నిష్క్రమించును..)

సునం—(నిష్క్రమించును).

రంగము :—మధురాపురములో సత్యభామాంతఃపురము.

[ప్రవేశము:—శ్రీకృష్ణుఁడు, సత్యభామ, సునందుఁడు.]

సత్య—నాథా! నిద్రనుండి యుల్లులికిపడి లేచితి రేమి ?

సునం—మిత్రమా! అపహాస్య మేమో కొంచెము నాకును వినఁదగిన వాఁడనేని చెప్పుము. సంతసించెదను.

శ్రీకృ—రమణీ! అది నిసంబంధమైనది కాదు. దానివలన నీకుఁ బ్రయోజనము లేదు.

సునం—అమ్మా! సత్యభామా! ఈవిషయములో నేదో యొకగొప్ప మరుగు నున్నది. లేకున్న నిట్లు నాశయమున గోపాలదేవుఁడు స్థల మీయ నేల ?

సత్య—నాథా! మీరు నిద్రలో నులికిపడి లేచుటయే గాదు. "ఓభక్తశిరోమణీ! ప్రమాదవశమున నీవిట్లుబడితివి. అయినను నీకుభయము మాత్రమైనను లేదు. నిరంతరభక్తజనసంరక్షణ దీక్షాబద్ధకంకణుఁడయిన వాసుదేవుఁడు నిన్నురక్షించు"నని పలికితివి. ఇది యేమి!

శ్రీకృ—రమణీ! యమునాపావన జలంబులలో నొక్క భక్తశిరోమణి నానిమిత్తము బడినాడు.

సత్య—ఎంతకష్టము. ఎంతకష్టము. నీకొఱకు యమునలోఁ బడ నేల ?

శ్రీకృ—ఆ పరమభ[illegible] నాసహాయమున యమునలోఁ గనఁబడుటయే కారణము.

సత్య—పాప మాతని కేవిధమయిన యుపాయము రాలేదు కదా!

శ్రీకృ—లేదు. లేదు. నాభక్తుల కెట్టియుపాయమును రానీయక కాపాడు భారము నాయందున్నది కదా! అందులో ఆవ్యక్తి సామాన్యమైన వ్యక్తి కాదు. మందిరావాసము విడిచి, భోగములరోసి,

సర్వసంగపరిత్యాగము గావించి, కాషాయాంబరముల ధరించి వారికై యన్వేషించుచు బయలుదేరిన వ్యక్తి.

సత్య—నాథా! అట్టి దివ్యమంగళవిగ్రహ సందర్శనము నాకగునా?

సునం—స్వామీ! యతులలో ననేకవిధములు. లోకులకు ఋణము తీర్పలేక తల బోడిచేసికొనువారు కొందఱు; భార్యపోరు బడలేక కొందఱు; ఇట్లనేకవిధములు. మీరు చెప్పినయతి యే తెగలోఁ జేరినవాఁడు.

సత్య—సునందా! ప్రతివిషయమున నేదియో యొక అడ్డు గల్పించుచుందువుగదా!

సునం—ఈనాటికి బీగము వేయుట కనేకసారులు ప్రయత్నించితిని కాని లాభము లేకపోయినది.

సత్య—నీకొకసారి గర్వప్రాయశ్చిత్తము కావలెను.

సునం—ఇప్పుడగునేమో యని సంశయించుచున్నాను.

సత్య—నాథా! ఆయతి దర్శనము నాకగునా?

శ్రీకృ—ఇప్పుడే యగును.

సేవకుఁడు—(ప్రవేశించి) దేవా! నారదమునీంద్రుఁడు బాలయోగితో వచ్చి ద్వారమునకడ నిలిచియున్నాడు.

శ్రీకృ—శీఘ్రముగఁ బ్రవేశపెట్టుము.

సేవ—(నిష్క్రమించి వెంటనే నారదునితోడను యతివేషముననున్న రాధతోడను బ్రవేశించును.)

నార—

తే. గీ. భవ్యయాదవాన్వయఘన ♦ వార్ధిచంద్ర!
భక్తరక్షణపారీణ! ♦ భవవిదూర!
నీరజాసనసన్నుత! ♦ నిర్వికార!
సకలభువనైకపరిపాల! ♦ జయము జయము.

శ్రీకృ—మునీంద్రా ! నమస్కారములు.

సత్య—మహర్షివర్యా ! వందనములు.

నార—దీర్ఘసుమంగలీభవ.

సత్య—నాథా ! నీవుచెప్పిన భక్తునిఁ జూపించెదనంటివే.

శ్రీకృ—చూపించుటకు సంశయములేదు కాని, చూచినపిదప, నేవిధ
మయిన యనుమానము చిత్తమున గలుగునోయని సం
శయము.

సత్య—నావిషయమై యట్లు తలంచెదరేల. నే నవివేకురాలను గాను.

నార—కృష్ణా

సీ. బాల్యమాదిగ నీయందు ♦ భక్తియుంచి
భవ్యభవదీయ పదసేవ ♦ పరమమోక్ష
మనుచుఁ దలఁచి నీకొరకు గని ♦ నరసి కరుణఁ
దాల్చి రక్షింపు నందనందన ! ముకుంద !

ఇదిగో భక్తురాలు.

సత్య—ఈమె భక్తురాలా ! భక్తుఁడు గాఁడా ?

శ్రీకృ—భక్తికి స్త్రీపురుష భేదము లేదు.

రాధ—హా కృష్ణా ! (మూర్ఛిల్లును).

శ్రీకృ—(రాధనుజేరి) రాధా ! లెమ్ము. లెమ్ము.

తే. గీ. శ్రమలఁబడితివి నాకునై ♦ జలజనయన !
బాల్యమునుండి నాయందు ♦ భక్తి నిలిపి,
తుదకు ధన్యతఁ గాంచితివి ♦ తోయజాక్షి !
కలరె నీవంటివారలు ధన్యులు ♦ క్ష్మాతలమున.

రమణీ ! ఇంక సంశయింపకుము. నీకు శాశ్వతముగ వశుఁడనగుదును.

రాధ—(లేచును).

సత్య—ఆహా! రాధమ్మా! రాధా! రాధా! యోగిని వైతివా? నిన్నుం జూడంగ నాకుంగలిగిన యానందమునకు మేరలేదు. శ్రీకృష్ణునిపై భక్తి నిన్నింతగాం జేసినది. నీవెంతిధన్యురాలవై తివి. (కృష్ణునిం జూచి) కృష్ణా! నీవు చెప్పిన భక్తురాలీమెయేకదా!

నార—అవును. చందురుని బింబము యమునయందుం జూచి కృష్ణుండని భ్రమించి యందుం బడి కొట్టుకొని పోవుచుండంగా నాశిష్యులు తీసినారు.

శ్రీకృ—మహాత్మా! వారు నాకు మహోపకారము జేసినారు.

సత్య—రాధా! నేటినుండి నేను నీకు శిష్యురాలను నాకు భక్తి మార్గము నుపదేశింపుము.

నార—కృష్ణా! పరతరాబాల్యవృత్తి భక్త్యుద్రేకమున నిన్ను రాధ గాంచినది. కృతార్థతం గాంచినది. రాధా! ఇంక నేమికావలయును.

రాధ—మునీంద్రా! నాకుం గావలసిన దేమున్నది.

తే. గీ. భక్తపరతంత్రుండైనట్టి ♦ వాసుదేవుం
డెపుడు నామనఃపీఠి వసించుంగాక!
భక్తులెల్లరు నీతని ♦ భజన సేసి
ముక్తి గాంతురు గావుతం ♦ బుడమియందు.

నార—(తథాస్తు.)

(అందఱు నిష్క్రమింతురు).

ఇది షష్ఠాంకము.

సంపూర్ణము.

3 లలితరాగం—ఆదితాళం.

లలిత—ఇష్టదైవమగు గోపాలునికయి యాహారము ధరియింపుమా॥ ఇ॥
కృష్ణహార మిది కీర్తికరము మది।
రాకులకతిశోభాస్పదమగు సీ॥ ఇష్ట॥

4 సురట—ఆదితాళము.

రాధ—ఋషిసన్నముగనుండెనా। నాథుడు పసివడి వడిదెల్పుమా
శారదా॥ ప॥

ఏసారసాక్షియోని యాజగన్మోహనుని యాశ్రించెనో॥ ప॥
పలుకవదేల। పలికింతువేల।
సలిలతాంగి దేమువియెను శారద।
నిలచిద్వారమున తినకై వేచితి।
యికనైనను రాడేమి కర్మమో ప॥

5 సింహేంద్రమధ్య—ఆదితాళ॥

రాధ—తీసివేయుమీ యలంకారి మడియానలేల సిర్వాగ్యరాల సరు
॥తీసి॥

మోసగించి యాగోపకుమారుడు నాసవతుల నెవ్వరినోచేరగ।
గాసిలి కాగెడు దేహంబు కిక కాల్పనా।
ఘనదలంకారములు॥ తీసి॥

6 యమునకల్యాణి—అటతాళం.

కృష్ణుడు—రామా సుధామా। గౌరీలలామ బోమానభ। రామా సు
కామా॥ రామా॥

ఆ మోహనాంగి యు। య్యారె శుభాంగి।
నారీవరాకారీ వారే లతాంగి॥
సుకుమారి వయ్యారి। వయ్యారి నారీ। యేదీ।

సత్య—పరిహరింపవలెన । ప్రాణవలయునా ।
పాపాత్ముడి । కారుణ్యగానిని॥ చ॥
కోర—చూడు ఈ చెలిని ముందువీడు । నిన్నింత్రో నేను వేసు ।
కొనుచుంటి నింతోగోడు॥
సత్య—చెప్పెదవా లేదా । నీచేష్టల నైపను కలమర్కటమా॥

10 సారంగ—రూపకము.

కృష్ణ—పలనిటుల వగలాగులవగున । హరిణనయన అలా॥ ప॥
కరుణగనవె । నీదాసుని మరచితివె ।
కగగాదల చెనవే । గురుసదయా ।
కరహ్యదయా । దరహాసితా । ననవినుతా ।
యదువనితా । వందనమిదె నాదరముగ॥ పలనిటుల॥

11 బీగ ఫలాస్—త్రిశ్రగతి.

సత్య—మేలోయి గోపాలబాలా నీమాటలు ।
చాలించు మీరాకానాకాశంపుకోటలు॥ మేలో॥
కృష్ణ—పలని నాపై నా నేడీకోపము । కరుణగనుము కమలనయన ।
నిరుపమశీల । మరూజలిముఖి॥
సత్య—అనృతములాడంగా । తగునటర వెన్నదొంగా ।
కృష్ణ—పదతినీకు శాపాతృలను బంధింపగరాదటే ।
సత్య—మేలోయి గోపాలబాలా నీమాటలు
కృష్ణ—ప్రాణసతి నాతో పోరాటంబిక నేలనే
సత్య—నళిననయన నీమృషాభినయములకిక నేమి లెమ్ము చనుము వేగ ।
కృష్ణ—చనగజాల ।
సత్య—మొండితనము ।

కృష్ణ—దండమిదిగో॥

సత్య—మేలోయి గోపాల బాలా నీకాటలు॥

12 సారంగ—ధ్రుపద్.

రాధ—సామగానలోలా । శ్రీగోలాగోపాల॥ సామ॥
ఓనీరజాక్షా । నీనామా । మేనాకు । జీవనా ।
ధారమా । ఆనంద గోవిందా॥ సామ॥
బాలగోపాల నీశుభరూపము ప్రత్యక్షమయ్యె బ్రహ్మానందము।
గలిగెనాశరీరము । పరవశమయ్యెను ।
జాలమేల కరుణాలవాల । నన్నేలుకోర మరి
మరి వేడితి నిను శ్యామలాకార నిర్వికారా॥ సామ॥
ఈచరాచరములన్నిట గోచరము నీరూపము ।
దోషహరణ । దాసభరణ । నిరాకార । నిరంజనా ।
పాహి పాహి మాంపాలయ । దయాసింధు దీనబంధు॥ సామ॥

13 సురట—ఆదితాళం.

సత్య—తగునా తగునా । అతివినయమునను మతి
గలతనపగ పదములు కెరగుట॥ తగు॥
కులకాంతలతో సరిచేసెదవా ।
ఇదియవమానము వినుమా । యదుజమమా॥ తగు॥
కపటవచనములను బలికి । కులట పాలబడితివా ।
గడసరి యమునాకాంతకొరకు మురిసి మురిసిపోతివా॥ తగునా॥

14 కాయామాళవ గౌళ—త్రిశ్రగతి.

రాధ—సుమహితశీలా । సుమహితశీలా॥ సు॥
మోహితయై యకార్యము నొనరించితివమ్మా॥ సు॥
పద్మమాలాతతాంగ । భూరిసరితంబగు సాధుని

పదముపాదపరాగ । పాంసులమగునటు ।
సలిపితి వయ్యా॥ సుమ॥
దాసురాలగుట నా । తనిబాధను గనిసైరను ।
భాసురాంగి నాశిరమును । బరనేయమిగ । గమకరకన॥

15 సురట—ఆదితాళం.

కృష్ణు—సుందరవదన మదనమోహిని । చంద్రబింబము నారీ ।
నారీ నారీ వయ్యారీ॥ సుంద॥
కనులనీరు ధారగాగ । వగవనేల కోమలీ తగునా ।
ఈవిధమూ । అగునా । సుగుణా । భరణా॥ సుందర॥

16 నాధనామక్రియ—రూపకం.

మధుర—ఎందుబోయె మా రాధా । సుందరిగనుపడదాయె॥ ఎందు॥
బృందావనవనవీధుల సుందరగోపాలునకై॥ ఎందు॥
డెందమునందే గతి యానందోళనమందినదో ।
ఇందుముఖి విరహాగ్నింబున । నేగతి దలచినదో॥ ఎందు॥

17 వాచస్పతి—ఆదితాళం.

రాధ—ఏడి యేడి నా । మనోహరుడు గో ।
పాలకృష్ణుడు । సన్నుతిగాత్రుడు॥ ఏడి॥
కోపమువిడయయి పిడనివాడు । దూరమునననిని ।
నవ్వెడువాడు । మూడుసారులీవె దొంగవయితివని ।
మురియుచుదాగుడు మూతలాడువా॥ డేడీ యేడి॥
ప్రణయకోపమును బాయగజేసి । పరితాపమును ।
దూరముజేసి । మోహముమోయుచును ।
గిరియగజేసి । ముద్దులాడి మురిపెంబుల జేసి ।
నేరు విడమునానంద బాష్పముల యుష్ణనీటిచిదపుల చప్పరించి

యిది యేమని । నేనడుగగ ।
నీయధరామృతమున కనుపావమనిన్నియత॥ దే॥

18 సింహేంద్రమధ్య—ఆదితాళం.

కృష్ణ—కమలముఖి । విమలసఖి యిటు నీకీగతికలిగెగ॥ కమ॥
సుమసుకుమారివి వనమార్గములన మా। నుమనుసుమా॥కమ॥
(సాకీ) ఓయబలా పరమమునీంద్రులకైన గానరా
నీభక్తియోగంబున కృతార్థురాలివి గా।
వనితాలోకమున శిరోమణివై । చెలంగితిగా ।
శ్రీమహాయనీవిం । జామంమున ।
వినరెదగా । కరుణాలోకనముల లో ।
లాక్షి విలోకింపగదే॥ కమ॥

19 మాయామాళవగౌళ—త్రిశ్రగతి.

నారదుడు—ఇదేమీకు ముచితరుణమూ । శ్రీరాధకా కృష్ణనాటక
మంగళ సన్నివేశ॥ ఇదే॥
కనులపండువయ్యెగా । కమలాక్షుని దర్శనమున
ఘనతరప్రేమ స్వరూపకవితాంచిత సుస్వరూపరాధ ।
ప్రణయరసాగాధ । కనులుమూయకు॥ ఇదే॥

20 బేగ్ ఫలాస్—త్రిశ్రగతి.

కృష్ణ—ఎందులకీయలుకా । నీ కెందులకీయలుకా॥ ఎం॥
సుందరాంగి యాగ్రింబుజూపదగునె నాపైని॥ ఎం॥
మందయానయిపుడు నీముఖేందుమండలము గనగని ।
యందంబుగ నాదిమహానందసాగరమునదేలె॥ ఎం॥
లక్ష్మీకళనాడనేని ఉండెదిపుడు నీకెట్టెడ సొక్కుగ ।
కారుణ్యామృతమును గురియింపుము యింపుగ॥ ఎం॥

21 సురట—ఆదితాళం

సత్య—వింటివటె తెరవా । దూరపుకొండలు నునుపనుసామెత॥ వి॥
వింటివటే నాథకయందంబుగా వింటివా వర్ణనచందంబుగా
కొంటె కృష్ణుని కోరి వలసినే ।
తోటివారంటి వయ్య । సొమ్ములిన్నాసిస సి

22 బ్యాగ్—ఆదితాళం.

కృష్ణ—జగంబులను పరిపాలింపగ । భగవంతుడై । జనియించితిని॥ జగం॥
అఘంబులను భూస్థలి దొలగించి । సుఖంబుగా భువిని వలోకించి ।
దిగంతముల శాంతిని ఘటించి ।
వగన్ దొలగించి మహా శాంతంబుగ । జగం

23 నాదనామక్రియ—ఆదితాళం.

రాధ—రాధాకృష్ణయనెడు చతురాక్షరిమ్యా మంత్రమిది వినరమ్మా॥
ఆధారంబికముందు జనించెను । నవనీజనులకు మోక్షసాధనము॥
రాధయేకృష్ణుడు కృష్ణుడేరాధ । మాధవ మంగళ శాసనంబిది॥
త్రేతా జన్మమున సీ జన్మమున మందా జన్మనుమరియేజన్మమునైన ।
శ్రీమురళీధరు సేవలు చేయుచు వనవాసులమైనను వసియించెద॥

